# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

*[ Part II — Proceedings other than Questions and Answers ]*

## OFFICIAL REPORT

---

*Fifteenth Day of the Sixth Session of the*
*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 13th November, 1957*

The House met at Half Past Eight of the Clock

[ MR SPEAKER IN THE CHAIR ]

## QUESTIONS AND ANSWERS

( SEE PART I )

## ELECTION OF A MEMBER TO THE ZONAL RAILWAY USERS' COUNSULTATIVE COMMITTEE OF CENTRAL RAILWAY

మిస్టర్ స్పీకర్ . సెంట్రల్ రైల్వే జోనల్ కన్సల్టేటివ్ కమిటీకి సభ్యుని ఎన్నికకై పోలింగు నిన్ననే జరిగింది ఎన్నికలో శ్రీ కె సత్యనారాయణగారు గెలుపొందినట్లు ప్రకటిస్తున్నాను

## ANNOUNCEMENT RE DICUSSION ON PATASKAR'S REPORT

మిస్టర్ స్పీకర్ : 14-11-57 సాయంత్రం 4 నుండి 7 వరకు పటాస్కర్ నివేదికమీద చర్చ జరుగవలసివున్నది కాని ఆ రిపోర్టు ఇవ్వాళే సభావేదికపై పెట్టబడింది సభ్యులు శ్రద్ధగా చదువుకోవలసి యుంటుంది కనుకను, 15 వ తేదీన ముఖ్యమంత్రిగారు ఊళ్ళో ఉండరు కనుకను 14-11-57 బదులు 16-11-57 సాయంత్రం 4 గంటలనుండి 7 గంటలవరకు పటాస్కర్ రిపోర్టును చర్చించటానికి అవకాశము యివ్వబడుతుంది.

శ్రీ గోపిడి గంగారెడ్డి (ముథోల్) అధ్యక్షా, శ్రద్ధగా చదువుకోమని మీరు చెప్పారు కాని ఆ రిపోర్టును తెలుగులో మాకు ఇవ్వలేదు మరి ఎలా చదువుకోవాలి ?

శ్రీ టి పాపారావు (నాగరికటకం) పటాస్కర్ రిపోర్టు కాపీ ఒకటి ఇచ్చారు కాని మాప్ ఇవ్వలేదండి మాకు దక్షిణ సరిహద్దులు సరిగా తెలియవు మాప్ వుంటే తెలుసుకొని discuss చేయటానికి వీలుంటుంది కనుక map సప్లయి చేయిస్తారా ?

మిస్టర్ స్పీకర్ Official language ఇంగ్లీషు ప్రతిదానికి ఇంగ్లీషుకు తెలుగు వచ్చేటట్లుగా ఏర్పాటు చేయటానికి Rules లో సవరణ తెస్తున్నాము ముందుముందు ప్రభుత్వంవారు దానికి తోడ్పడుతారని నా నమ్మకం మాప్ విషయం అది too late అవుతుందేమో అనుకొంటాను

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్ సంజీవరెడ్డి) అధ్యక్షా ! ఇన్ని maps సప్లయి చేయటం కష్టమవుతుంది Subject పైన interest వున్నవారు చదువుకొని వస్తారు ఏ తాలూకా, ఏ గ్రామం ఎక్కడ వుంది అనేదానిపై 4 సంవత్సరాలనుండి మనం చర్చిస్తున్న subject ఇది గోపాలరెడ్డిగారు, చెంగల్వరాయనాయుడు గారు మొదలయినవారు చర్చిస్తారు మిగిలినవారు అంత శ్రమపడవద్దని, కష్టపడవద్దని చెబుతున్నాను

శ్రీ టి. పాపారావు : ఉత్తర సరిహద్దుల విషయం

శ్రీ ఎన్. సంజీవరెడ్డి : పటాస్కర్ ఉత్తర సరిహద్దుల గురించి వ్రాయలేదండి. పటాస్కర్‌ను appoint చేసింది ఒక్క దక్షిణ సరిహద్దుల గురించి మాత్రమే, మిగిలిన సరిహద్దులగురించి చర్చరాదు రేపు చర్చలోకూడా వర్లాకిమిడి కాని, కోలారు మొదలయినవితావు ఒక్క మదరాసు-ఆంధ్ర సరిహద్దుల నిర్ణయానికి పటాస్కర్‌ను appoint చేశారు. కాబట్టి ఆ విషయమే వస్తుంది. గంగారెడ్డిగారు తెలుగులో లేదన్నారు పటాస్కర్ గారు అది ఇంగ్లీషులో వ్రాశారు. తెలుగులోనికి తర్జుమా చేయించటానికి time లేకపోయింది వారి ప్రక్కన కూర్చున్న నోషలిష్టు మిత్రుల సహకారంతో అర్థం చేసుకొంటారని ఆశిస్తున్నాము.

# THE ANDHRA PRADESH AGRICULTURAL HOLDINGS (CENSUS) BILL, 1957

*Clause* 2

*Sri P Sundarayya (Gannavaram)* I beg to move

"In line 2 of clause 2 (a), after the words 'land holder', insert the following

'and his wife, unmarried daughters, minor sons, sons who attained majority age but not yet partitioned their shares and their wives, father, mother and by any other relative dependent on the land-holder'"

*Mr Speaker* Amendment moved

శ్రీ యల్. లక్ష్మణదాస్ (పాతపట్నం - జనరల్) Point of order, Sir శ్రీ సుందరయ్యగారి amendment లో 'wife' అనే పదాన్ని add చేశారు స్త్రీధనం మూలంగా వుండే హక్కును restrict చేసే అధికారం మనకు లేదేమో అందుచేత యీ amendment చెల్లదేమోనని నే ననుకొంటున్నాను మీరు దానిమీద రూలింగ్ యివ్వాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ · ఏది చెల్లదని మీ ఉద్దేశం ?

శ్రీ యల్. లక్ష్మణదాస్ 'Wife' కు ప్రత్యేకంగా property చూపించడానికి అవకాశం లేదని సుందరయ్యగారి సవరణ. స్త్రీకి సహజంగా వచ్చిన ఆస్థి ఉంటుంది ఆ ఆస్థిని స్త్రీధనంగా లెక్కలు చూపించవలసిన అవసరం లేదని వారు amendment యిస్తున్నారు.

మిస్టర్ స్పీకర్ అదికాదు వారి సవరణ. Land holder కాకుండా, ఆయన భార్య, ఆయన పెళ్ళిగాని కూతురు, ఆయన minor sons మేజర్ అయినప్పటికీ partition కాకుండా వారిలో ఉన్నవారు, వారి భార్యలు, తల్లి తండ్రి యింకా ఆయన మీద ఆధారపడే ఏ యితర బంధువులయినా అనేమాట వచ్చింది. తమరు చెప్పే స్త్రీ ధనం విషయమై అసలు ప్రశ్నే arise కాదు పురుషుడికి తన స్వంత ఆస్థి ఉన్నప్పుడు ప్రభుత్వానికి లెక్కలు ఎట్లా యివ్వవలెనో, అట్లాగే స్త్రీకూడా తన స్వంతఆస్థి వుంటే (personal property, absolute property) ఆవిడ కూడా లెక్కలు యివ్వాలి, పట్టాదారు అన్నప్పుడు స్త్రీ అయినా, పురుషుడు అయినా ఒకటే.

రెవిన్యూమంత్రి (శ్రీ కె వెంకటరావు) స్త్రీకి ప్రత్యేకంగా 20 ఎకరాల కంటె పైన స్త్రీ ఆస్తివుంటే లెక్కలు యిచ్చితీరవలసినదే దానిని గురించి యిప్పుడేమీ లేదు సుందరయ్యగారి కోరిక ఏమిటీ అంటే ఈమధ్యన వారిపేర పెట్టి, వీరిపేర పెట్టి వ్రాశారు. holding లో అనుమానింపబడిన వారికి యిచ్చారు, యిదంతా కలిపిపెడితేనే మనకు ముందు ఉపయోగిస్తుంది కాని ప్రస్తుతం ఉపయోగించదని ఆయన holding ను define చేస్తున్నారు. కాని rights ను define చేయడంలేదు. After all it is gathering of census ఎంత ఎవరిదగ్గర వుందనే లెక్కలు ఆ రకంగా లెక్క తీసుకోవద్దు, యీరకంగా తీసుకోమంటున్నారు దీనివల్ల స్త్రీ ధనం హక్కుపోతే అసలు ceiling కాక పోవచ్చు అందుచేత ఆ వ్యవహారం వేరు

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, నా సవరణను చదివి వినిపించాను ఇది ఏ రీతిగా అవసరమో నిన్న కొంత వివరించాను ఇప్పుడు మరొక పర్యాయం ఆ విషయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకురాదలచినాను ఇప్పుడు మనం చర్చించేది స్త్రీ ధనం యొక్క హక్కులను గురించి గాని, స్త్రీ హక్కును గురించి గాని, ceiling ఎంత నిర్ణయించబోతున్నాము, ఎంత నిర్ణయించాలి అనేదికాని, పన్నులు ఎట్లా వేయాలి అనేది కాని కాదు దానికి వేరే బిల్లులు ఉంటూనేఉన్నాయనుకోండి మనం వీటన్నింటిని గురించీ యీ బిల్లులో చర్చించడంలేదు మనకు holding census కావాలిఅనే ఉద్దేశంతో తీసికుంటున్నాము Holding అంటే యీ బిల్లులో ఉన్నది "ఒక వ్యక్తిపేర ఎంత పట్టావుంటుందో జాయింటు పట్టా కాకుండా, స్వంత ఆస్థిఅయివుండి, legal rights వుండి, దానికి సంబంధించిన పట్టా వుండి,...అతనికి రాష్ట్రం మొత్తంమీద అటువంటి పట్టాలు ఎన్ని ఉన్నాయి, మొత్తం ఆస్థి ఎంత ఉన్నదీ, మొదలైన లెక్కలు చెప్పాలని కోరారు. కాని ముందు ముందు graded taxation పెట్టదలచుకున్నా, లేక భూమి గరిష్టపరిమితి పెట్టదలచుకున్నా— లేకపోతే యింకే పని చేయదలచుకొన్నప్పటికీ కూడ సంఘ వ్యవస్థలో తారతమ్యాలు ఏవిధంగా వున్నాయో తెల్సుకోదలచుకున్నా, ఏ పని చేయదలచుకున్నా కూడ statistics సక్రమంగా ఉండాలి.

ఈ లెక్కలు సమగ్రంగా ఉండాలనేటట్లయితే కుటుంబాన్ని ఒక unit గా తీసుకోవాలి తలకు ఇంత అని తీసుకుంటే ఆ లెక్కలు ఉపయోగంలేని లెక్కలుగా తయారు కాబోతున్నాయి. మానవసమాజానికి మూలం కుటుంబం. ఒకే యింటిలో భార్యాభర్తలు, వాళ్ళబిడ్డలు, వాళ్ళమీద ఆధారపడిన బంధు

వులు, వాళ్ళకున్న భూమిని వ్యవసాయం చేసుకుంటూ, కలిసిమెలిసి జీవిస్తూ (తెలుగులో ఒక సామెత చెప్పినట్లు, యింటిలో పొయ్యివేసుకొని కలిసి వంట చేసుకొని భోజనం చేసేటటువంటివాళ్ళు) చాలా సన్నిహితంగా ఉన్నటువంటి వాళ్ళు, గలది ఒక కుటుంబం ఈ కుటుంబాన్ని ఆధారంగా చేసుకొని ఉన్న సమాజం అన్నవిధాలా అభివృద్ధి చెందేదానికి అవకాశం ఉంది అందుచేత కుటుంబాన్ని ఒక unit గా తీసుకొని, ఈ విధమైనటువంటి family holdings మనం తీసుకొన్నప్పుడే మనకు కావలసిన లెక్కలు సరిగా ఉంటాయి రేపు భూసంస్కరణలు తీసుకువచ్చినట్లయితే అపుడు గరిష్ఠ భూపరిమితిని 20 ఎకరాలు పెడదామా ? 30 ఎకరాలు పెడదామా లేకపోతే ఎంత పెడదాము ? అనే సంగతి గురించి తరువాత ఆలోచించుకోవచ్చు కాని భూసంస్కరణలను తెచ్చేటప్పుడు, వాటిని ఒక వ్యక్తికి ఉన్న భూమిమీద గరిష్ఠ ప్రమాణం నిర్ణయించడంవల్ల సాంఘికన్యాయం జరగదు అలాగే graded tax వేయదలచుకొన్నప్పుడు ఏ తలకు ఆ తలకు ఈ tax ను వేస్తే higher gradation లోనున్న వాళ్ళంతా తక్కువ gradation లోనికి రావడానికి వీలుంటుంది వీటన్నిటినీ చూచుకొన్నా ప్రభుత్వం దగ్గర సరైన లెక్కలు, సరైన వివరాలు ఉండాలి ఎవరయినా ఇతరులకు అమ్ముకొనే విషయములో మనకు ఎటువంటి అభ్యంతరమూ ఉండకూడదు అమ్ముకుంటారా, లేదా? అన్నసంగతి మనకు అనవసరం లెక్కలు తయారు చేసుకోనేటపుడు మనకు సరైనటువంటి లెక్కలు, వివరాలు కావాలంటే కుటుంబాన్ని యూనిట్‌గా తీసుకోవాలి కుటుంబం అంటే ఏమిటి ? కుటుంబం అన్నపుడు భర్త, భార్య, కొడుకులు, పెళ్ళికాని కూతుళ్ళు మన హిందూ చట్ట ప్రకారం 15 ఏళ్ళు దాటితేకాని ఆడపిల్లలు పెళ్ళి చేసుకోడానికి హక్కులేదు అందుచేత కూతురికి పెళ్ళయిన తరువాతకూడా ఆస్తి మీద హక్కు ఉంటుంది పెళ్ళి చేసుకొన్నతరువాత భర్తతో కాపురానికి వెళ్లే సాంప్రదాయం వుంది, కాబట్టి ఆ ఆస్తిని వెంటనే పంచకపోయినా ఆమెపేర కొంత యివ్వడం ఎలాగా తప్పదు కాబట్టి వాళ్ళకున్న ఆస్తి ఈ లెక్కలోకి రాదు పెళ్లయినతరువాత ఆమె ఇంకొక కుటుంబంలో కోడలుగా ఉన్నందువల్ల అక్కడ ఆస్తి లెక్కలోనికి వస్తుంది ఆమెకున్న ఆస్తి, ఆమెకు వచ్చే స్త్రీధనం, ఈవిధంగా భార్యక్రింద లెక్కలోకిపోయే అవకాశం ఉంటుంది మైనరు కొడుకులు మితాక్షరిప్రకారం ఆస్తిని పంచుకునే హక్కు ఉన్నప్పటికి కూడా minority తీరిన తరువాతనే పంచుకొనే హక్కు అమలులోకి వస్తుంది అందుచేత ఈలోపున వాళ్లకున్న ఆస్తి కుటుంబక్షేత్రంలోనే ఉంటుంది కొంతమంది majority వచ్చినప్పటికీకూడా ఏకారణం చేతనయినా పంచుకోకుండా కుటుంబంలోనే ఉంటే ఎక్కువ ఆదాయం వస్తుందని, ఎక్కువ లాభకరం అని

అనుకొనేటట్లయితే, వారి ఆస్తులుకూడా కుటుంబక్షేత్రం క్రిందనే ఉంటాయి అటువంటివాళ్ళు పెళ్ళి చేసుకొన్నపుడు వాళ్ల భార్యల ఆస్తికూడా ఒక కుటుంబక్షేత్రంగానే చూసుకోవాలి రేపు విడిపోతే వారి హక్కు వారి కుంటుంది వారి హక్కులను సంకుచిత పరచాలనే ఉద్దేశ్యం కాదు మొత్తం మీద మనం ఎవరెవరిపేర ఎంతెంత ఆస్తి ఉన్నది అనే వివరాలను తెలుసుకున్నట్లయితే ముందుముందు ఎక్కడ గీటుగీయాలి అన్న సంగతి తెలుసుకోవచ్చు అందుచేత సమగ్రంగా లెక్కలు సేకరించాలి ఒక కుటుంబంలో ముసలి తల్లి తండ్రులు ఉండవచ్చు "వారు ఎవరి దగ్గరా ఉండకూడదు, అంతా స్వంతంగా వ్యవసాయం చేసుకోవాలి వాళ్లను దూరంగా వదలివేయాలి" అని మనం కోరడం లేదు ఆ తల్లిదండ్రులుకూడా అక్కడే ఉండవచ్చు అయితే వాళ్ల పేర ఎంత ఆస్తిఉందో, ఎంత భూమి ఉందో ఆ వివరాలు మన లెక్కలలో ఉండడం అవసరం 'Any other relative dependent on the land holder' అని ఉంది కుటుంబ యజమాని పర్యవేక్షణ క్రింద కాని, ఇంకే విధమైన బంధుత్వమైనా సరే, ఒక కుటుంబం క్రింద జీవిస్తున్నపుడు వారి ఆస్తి కూడా మనం లెక్కచూసుకోవలసి ఉంటుంది. ఎవరి హక్కులనో తగ్గిస్తామని, వారి ఆస్తి అంతా మనం తీసునుంటాము అనేది ఇపుడున్న సమస్యకాదు ఆలాగ తీసుకోము భూసంస్కరణలకు ఈ లెక్కల వివరాలనన్నిటినీ తెలుసుకోవలసిఉంటుంది. ఈ రోజున బినామీ ట్రాన్సుఫరులు అనేక రకాలుగా జరుగుతున్నపుడు వాటిని మనం కొంతవరకు అదుపులో పెట్టదలచుకొన్నప్పటికీకూడా ఎంతవరకు యిస్తే బినామి ? ఎవరికి యిస్తే బినామి ? ఎవరికి యివ్వకపోతే బినామి ? అనేవి మనం తెలుసుకోడానికి ఈ లెక్కలు తప్పక తోడ్పడతాయి దీనిని దృష్టిలో పెట్టుకొని, మనకు సమగ్రమైన లెక్కలు ఉంటేనే ఏపనైనా చేసేదానికి వీలుంటుంది. అటువంటి లెక్కలను తయారుచేసుకోడానికి మనం పూనుకున్నప్పుడు వాటిని సమగ్రంగా తీసుకోవడం మంచిదని నేను ఈ సవరణను ప్రతిపాదిస్తున్నాను దీనికి అనుగుణ్యంగానే schedule కు కూడా మార్చవలసిన అవసరంఉన్నదని schedule కు కూడా తరువాత సవరణలను తీసుకువస్తున్నాను ఇవి లేకపోతే schedule అనవసరం. Schedule లోని table కే, ఈ సవరణ తప్పితే ఇంకేమీ కాదు. అందుచేతనే ఆ explanation లో "who are not so related as defined above" అనేమాటలు పెట్టవలసివస్తుంది ఎవరి ఆస్తి వారిపేరుమందో తెలియజేయడానికి పట్టాలు ఆరకంగా విడదీయబడలేదు బంధువులయినా కాకపోయినా, బంధుత్వమున్నా లేకపోయినా, కుటుంబానికి ఏమీ సంబంధం లేనివారు, గ్రామాలలో ఇద్దరో, ముగ్గురో లేకుంటే 10 మందో, కలిసినటువంటి వారికి ఏ ఒక జాయింట్ పట్టా క్రింద కొంత

భూమి ఉంటుంది అటువంటి joint పట్టా, 100 ఎకరాలకు ఉండవచ్చు 1000 ఎకరాలకు ఉండవచ్చు 50 ఎకరాలకు ఉండవచ్చు లేకుంటే 4 ఎకరాలకు ఉండవచ్చు అటువంటిచోట ఎవరెవరికి ఎంతభూమి ఉన్నదనే దానికి మనకు గుర్తు ఉండదు Government revenue లెక్కలలో joint పట్టాక్రింద ఆస్తి హక్కు లేనటువంటి వాళ్ళంతా ఊరికే శిస్తుమాత్రం కడుతుంటారు ఈ joint పట్టాలవల్ల గ్రామ మునసబు, కరణాలకు ఎక్కువ ఉపయోగంగా ఉంటుంది పన్నును కట్టినా, కట్టకపోయినా ఎవళ్లో కట్టలేదని అందరి దగ్గర్నుంచీకూడా వసూలుచేసే అవకాశం వారికి ఉంటుంది అందుచేత అన్నీ సరిగా ఉన్నట్లయితే ఎవరి ఆస్తి ఎంతవుందో అంతవరకు మన లెక్కలలో చూపించే దానికి అవకాశంఉంటుంది Single పట్టాగాకాని, joint పట్టాగాకాని మొత్తం వాళ్ళకున్న భూమి ఎవరెవరిపేరున ఎంతెంత ఉన్నదో చూపించేదానికొరకు మేము ఈ సవరణను పెట్టడం జరిగింది అందుచేత ఇది చాలా ముఖ్యమైన సవరణ కాబట్టి దీనిని ప్రభుత్వం వారు అంగీకరించి, ఈ బిల్లును సక్రమంగా ఉపయోగించుకోవాలనుకుంటే మళ్ళీ ఇంకొక సవరణ చట్టంతోనో, ఇంకొక చట్టంతోనో దీనిని సవరించి అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ ఎమ్. నాగిరెడ్డి (మాచర్ల) అధ్యక్షా! ఈ సవరణను అంగీకరించవలసినటువంటి అవసరం ఉందని ఇపుడు సుందరయ్యగారు చెప్పినటువంటి కారణాలతో పాటు నేను నా అనుభవాలను కూడా ఇచట మనవి చేస్తున్నాను Land Revenue Surcharge Bill పోయినసారి ఆంధ్ర ఎసెంబ్లీలో pass చేసినపుడు ఒక్కొక్క వ్యక్తి తాను ఎంత శిస్తు చెల్లించుతూ ఉంటాడో దాని మీద ఈ surcharge విధించబడుతోంది అని చెప్పడం జరిగింది అపుడు 1 రూపాయినుంచి 10 రూపాయలకు యింత,10 నుంచి 50 రూపాయిలకు యింత అని surcharge ని విధించాము ఇక 100 రూపాయల శిస్తు చెల్లిస్తున్నటువంటి వాళ్ళుకూడా 3,4 భాగాలు చేసుకొని, 10-50 మధ్యనో 1-10 రూపాయల మధ్యనో వచ్చేటట్లుగా చేసుకోవడంద్వారా ఈ surcharge ని తక్కువ కట్టడం కూడా జరిగింది. ప్రభుత్వానికి ఆదాయం పోయింది. మంత్రిగారు "మేము ఆర్డినెన్స్ పాస్‌చేసేనాటికి ఎంత అయితే ఉందో దానిలెక్క యివ్వాలి కాని మధ్యలో జరిగినటువంటి బినామీ విక్రయాలేమీ చెల్లవు, కాబట్టి వాటినన్నిటినీ యివ్వవలసిందే" అని చెప్పారు, అలాగ చెప్పినందుకు సంతోషమే కాని అంతకు ముందుకూడా ఎప్పుడైతే ఆంధ్ర ఎసెంబ్లీలో ఈ Surcharge Bill పాసైనదో ఆనాటినుంచీ surcharge కట్టేటటువంటి వాళ్ళు దానిని తగ్గించుకోవాలనే ఉద్దేశ్యంతోటి

బినామీ విక్రయాలుకూడా జరుపుతూవచ్చారు రేపు మన ప్రభుత్వం భూసంస్కరణలను తీసుకురావాలనుకొన్నపుడు కూడా ఒక్కొక్క కుటుంబం క్రింద, పిల్లలపేరకాని, భార్యపేరకాని మొత్తం ఆస్తి ఎంతెంత ఉందో చెప్పాలి ఇపుడు ప్రభుత్వం కోరినటువంటి ఈ బిల్లు ప్రకారం వాని కింద ఉన్నటువంటి భూమికి వాళ్ళు లెక్కలు యివ్వడం మొదలుపెట్టేటట్లయితే కుటుంబానికంతా ఉండేటటువంటి లెక్కలు తేతే పరిస్థితులు ఉండవు రేపు మళ్ళా కళావెంకట్రావుగారే Socialism, మన దేశంలోకి వచ్చేసిందయ్యా, Communism కూడా వచ్చేసింది, పంచటానికేమీ భూమి కనబడడంలేదు, అందరూ 20 ఎకరాలకు లోపు వాళ్ళే కనపడుతున్నారు, అనేటటువంటి విషయాన్ని సులభంగా చెప్పడానికి అవకాశాలుంటాయన్నమాట ఒక్కొక్క విభాగం కానటువంటి కుటుంబాల క్రింద ఎంతైతే భూమి ఉందో ఆ కుటుంబాలు, వాటి క్రింద నున్నటువంటి భూమికి స్పష్టంగా లెక్కలు వస్తే, యిదుగో ఇవి family holdings ప్రకారం ఈ జనాభాకు యింతపోను, ఈ కుటుంబానికి యింతపోను, ఇంకా ఎంత భూమి మిగులుతుందనే టటువంటిది స్పష్టంగా తెలుస్తుంది

ఈనాడు ఎంత మిగులు ఉన్నది, ఎంత బంజరుభూమి ఉన్నది, ఎంత పంచగలము అనే విషయమై సక్రమమైన లెక్కలు కావాలి ప్రతిపక్షమువారిస్తున్న అంకెలు ఒకరకంగా ఉంటూంటే ప్రభుత్వంవారిస్తున్న అంకెలు ఇంకొకరకంగా ఉంటున్నవి ప్రభుత్వ లెక్కలను చూచినట్లయితే పేద ప్రజలకు పంచడానికి ఏమీ ఉండనట్లు కనపడుతుంది కుటుంబములోని వ్యక్తులపేర ఎంతెంత భూమి ఉన్నదో ప్రభుత్వము తెలుసుకోవాలి జాయింటు కుటుంబములలోని ఎవరిపేరనయినప్పటికి ఎవరిపేర ఎంత భూమున్నది ప్రభుత్వము దగ్గర లేకపోతే, పేద ప్రజలకు పంచడానికి ఎంతభూమి ఉంటుందనే అంచనా లేకపోతే భూసంస్కరణలను తేవడమే కష్టమవుతుంది 30 ఎకరాల సీలింగు పెడితే ఎంతభూమి మిగులుతుంది, 20 ఎకరాల సీలింగు పెడితే ఎంత మిగులు ఉంటుంది అనే విషయము గురించి సరైన లెక్కలు ప్రభుత్వమువారి దగ్గర ఉండాలి. ఈ ఎమెండుమెంటును అంగీకరించినంత మాత్రంచేత ప్రభుత్వమునకు నష్టములేదు బినామీ విక్రయాలను ఆమోదించకపోయినట్లయితే సరి అయిన లెక్కలు రావడానికి వీలుంటుంది, అన్యాక్రాంతాలను ఆపుచేయడానికి యీ సవరణ ఎంతయినా ఉపకరిస్తుంది.

శ్రీ కె వెంకటరావు (శ్రీ) నాగిరెడ్డిగారు నేనేదో చెప్పానని అంటున్నారు. నేను చెప్పినదిది ఆర్డినెన్సునాటికి ఉన్న భూమిని నిర్వచించవలెనని చెప్పాము కాని దరిమిలా చేసిన మార్పులు చెల్లవు అని నేను చెప్పలేదు సెప్టెంబరు 21 తేదీన గల భూముల అంకెలు చెప్పవలెననే కోరినాము కాని దరమిలాను వారు ఏమిచేసుకొన్నా యీ ఆర్డినెన్సుక్రింద చెప్పవలసిన అవసరము లేదని నేనన్నాను ఐతే ఇది అంకెలకు సంబంధించిన విషయం ఈ సవరణపై చెబుతున్న ఆర్గ్యుమెంటులో జాయింట్ ఫామిలీ అనేదాని యొక్క నిర్వచనము వారి వారి యిష్టము వచ్చినట్లుగా చెప్పడం జరుగుతున్నది జాయింటు ఫామిలీ అనేదానిని డిఫైన్‌చేయడం చాలా కష్టము ఒక యింట్లో పుట్టిన కొడుకులూ కూతుళ్ళకే కాక వీధిలో పుట్టిన కూతుళ్ళకు, కుమాళ్ళకుకూడా కొంతవరకూ వాటాలు యివ్వవచ్చునని హిందూ 'లా' లో ఉన్నది అటువంటి సందర్భాలకు ఇక్కడ ప్రొవిజన్ లేదు సుందరయ్యాగారు ఇచ్చిన డిఫినిషన్‌లోకూడా లేదు (ఇంటరప్షన్) శ్రీ సుందరయ్యాగారు కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో ఉన్నప్పుడు హిందూలాను మార్పించి ఉంటే వీలుఉండేది ఒక కొడుకుకు కట్నము యిచ్చారనుకోండి ఐతే జాయింటు ఫామిలీలోఉన్న ఇతర మెంబర్సుకు దానిలో వాటా రాదు ఎవరికి ఎంతభూమి ఉన్నదో తెలుసుకునే సందర్భములో యీ లీగల్ పాయింట్సును లా ఆఫ్ సక్సెషన్ మొదలయిన, వాటినన్నిటిని యీ క్లాజు వల్లనే డిటర్‌మిన్ చేయడం కష్టము ఇది అనవసరము కూడా ఒక పట్టాదారుకు ఎంత భూమి ఉన్నది అని నిర్ణయించవలసినదే తప్ప కుటుంబమునకంతా కలిపి ఎంతభూమి ఉన్నది అని చెప్పడము చాలా కష్టము, ఐతే లెక్కలు సేకరించినతరువాత కలుపుకుంటే కలుపుకోవచ్చు అంతేకాకుండా అన్ డివైడెడ్ మెంబరు యీ పైన యెప్పుడూ పంచుకో కూడదు అని చెప్పడం కష్టము ఏమైనప్పటికీ ఎవరి యిష్టము వచ్చినట్లు వారు కుటుంబమునకు నిర్వచనము యివ్వడమువలన యీ సమస్య పరిష్కారము కాదుకాబట్టి యీ సవరణను ఉపసంహారించుకోవలెనని కోరుతున్నాను

శ్రీ జి యల్లమందారెడ్డి (కనిగిరి) ఒక కుటుంబములో భార్యపేర కొంతభూమి, భర్తపేర కొంతభూమి ఉంటుందనుకోండి. వారిద్దర పేరనున్న భూమియొక్క విస్తీర్ణము 20 ఎకరాలకు మించినట్లయితే వారు యీ ఆర్డినెన్సు ప్రకారముగా లెక్కలు ఇవ్వవలసి ఉంటుందా ?

శ్రీ కె. వెంకటరావు మా లెక్కప్రకారము ఏ వ్యక్తియైనా అన్‌డివైడెడ్ మెంబరు అయివున్నట్లయితే ఆయన పేరన 20 ఎకరాలకు పైన భూమి

ఉన్నట్లయితే దానిని గురించి లెక్కలు ఇవ్వవలసి ఉంటుంది 20 ఎకరాలకు లోపుగా ఉన్నట్లయితే లెక్కలు ఇవ్వనవసరము లేదు

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) భర్త భార్య పేరన 10 ఎకరాల భూమిని కొంటాడు భార్యా భర్తా కలిసి కాపురం చేస్తూ ఉంటారు కాని పట్టాలు వేరువేరుగా ఉంటాయి భర్త పేర 15 ఎకరాలు, భార్య పేర 10 ఎకరాలు మొత్తము 25 ఎకరాల ఆసామి అతడు అతడు యీ లెక్కలను యివ్వవలసి ఉంటుందా ?

శ్రీ కె. వెంకటరావు ఇవ్వవలసిన అవసరము ఉండదు అది streedhana property అవుతుంది దానికి ఇంతవరకూ ఉన్న 'లా' ప్రకారము అభ్యంతరము లేదు తల్లిదండ్రులు గాని, భర్తగాని యిచ్చిన ఆస్తి స్త్రీధనము అవుతుంది. భార్యా, భర్తా యిద్దరూ కలసి కుటుంబమునకు కారకులు కావచ్చును గాని వారిద్దరూ జాయింట్ ఫామిలీ డిఫినిషన్‌లోకి హిందూ 'లా' ప్రకారము రాకూడదు.

మిస్టర్ స్పీకర్ జాయింటు హిందుఫామిలీలో ఏ మెంబరు పేర భూమి ఉన్నా మేనేజర్లు లెక్క ఇవ్వవలసినదేనా ?

శ్రీ కె. వెంకటరావు ఇండివిడ్యుయల్ బేసిస్ మీద హోల్డింగ్సు లెక్క తీసుకుంటున్నాము కాబట్టి అన్‌డివైడెడ్ మెంబరు తన పెరసనలు కెపాసిటీ (personal capacity) లో హోల్డుచేసిన భూమికి లెక్కలు ఇవ్వనక్కరలేదు. కాని జాయింటు ఫామిలీ ప్రాపర్టీ 20 ఎకరాలకు మించిఉన్నట్లయితే తప్పకుండా ఇవ్వవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది దీనివిషయంలో Sec 222 of Hindu Law చదివి వినిపిస్తాను

"A Hindu even if he be joint may possess separate property Such property belongs exclusively to him. No other member of the co-parcenery, not even his male issue, acquires any interest in it by birth. He may sell it or he may make a gift of it or bequeath it by will to any person he likes. It is not liable to partition On his death intestate it passes by succession to his heirs and not by survivorship to the surviving co-parceners "

***Mr. Speaker*:** **The question is**

**"That in line 2 of clause 2(a), after the words 'land holder', insert the following :**

'and his wife, unmarried daughters, minor sons, sons, who attained majority age but not yet partitioned their shares and their wives, father, mother and by anv other relative dependent on the land-holder' "

The motion was negatived

*Sri P Sundarayya* I demand a division, Sir

The House then divided

Ayes 31    Noes 78

The motion was negatived

*Sri G Yellamanda Reddi* Sir, I beg to move

'In Explanation to sub-clause (a) of Clause 2, after the wodr 'jointly' *insert* the following words—'

"but who are not members of the joint family "

*Mr Speaker* Amendment moved

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) ఇందులో "Where a land is held by two or more land holders jointly" తరువాత "but who are not members of joint family" అని చేర్చాలని సవరణ యిచ్చారు "Joint family members కాకుండా ఉంటేనే" అని ఉండాలని సవరణలో చెపుతున్నారు వెంకటరావుగారు Hindu Law లో నుంచి చదివారు దాని ప్రకారంచూస్తే జాయింట్ ఫామిలీలో ఎవరిపేరనైనా ప్రత్యేక కారణంవల్ల కొంత ఆస్థిఉంటే అది లెక్కలలో యివ్వాలనేది యిందులో reflect అవుతుంది అందుకని సుందరయ్యగారి సవరణకు, దీనికి, తేడా ఉన్నది దీనికి ప్రత్యేకమైన purpose ఉన్నదని తెలియజేస్తున్నాను సుందరయ్యగారిది ఒప్పుకుంటే యిది అవసరం అయ్యేదికాదు అది ఒప్పుకొనలేదు కాబట్టి, యిది అవసరం అయినది సుందరయ్యగారి సవరణకు కనీసం కొంతైనా ప్రభావం కలుగజేయాలనే ఉద్దేశంతో ఇది తీసుకురాబడింది ఇది ఒప్పుకుంటే జరిగేది ఏమంటే జాయింట్ ఫామిలీలో ఉన్న మెంబరు ప్రత్యేకంగా కొంతభూమి సంపాదిస్తే, అది తనపేర పెట్టుకొన్నప్పటికీ అదికూడ దీనిలో కలిపి యివ్వవలసిన అవసరం వస్తుంది

శ్రీ జి యల్లమందారెడ్డి ఈ అమెండ్‌మెంట్ చాలా సింపుల్ మంత్రిగారు మొట్టమొదట ప్రతి పక్షంవారు లేవదీసిన కొన్ని పాయింట్సుకు సమాధానయిస్తూ, జాయింట్ ఫామిలీ మొత్తం ఆస్తి, లెక్కలలో యివ్వాలని అర్థముఅని చెప్పారు ఇప్పుడు గ్రామములో కొన్ని జాయింటు పట్టాలు ఉన్నవి ఫామిలీ, జాయింటుగా లేకపోయినా ఊరిలో కొంతమందికి కలసి ఒకే పట్టా ఉన్నది Sub - divide కానందున జాయింట్ పట్టా అంటారు కాని conventionalగా ఆకుటుంబము యింతఆస్తిఅనుభవిస్తుందని కరణాలు సాగుబళ్ళ లెక్కలు వ్రాయటం, శిస్తు వసూలు చేయటం జరుగుతోంది, అందువల్ల జాయింట్ పట్టా complicated గా ఉన్నది దానికి యిబ్బంది రాకుండా, జాయింట్ ఫామిలీగా కలిసి ఉన్నవారు మాత్రం లెక్క యివ్వాలని అర్థము రాగలందులకు మంత్రిగారు చెప్పిన సారాంశం యిందులో యిమిడి ఉన్నది ఇది పెట్టకపోతే జాయింటుగా ఉంటున్నప్పుడుకూడ వేరువేరు లెక్కలు యివ్వటానికి అవకాశం ఉంటుంది అందువల్ల సెన్సస్ పర్పస్ కోసం జాయింట్ ఫామిలీగా కలిసి ఉన్నవారు వారి individual ఆస్తికాకుండా, మొత్తం జాయింట్‌ఫామిలీ ఆస్తికి లెక్క యివ్వాలి ఇది మంత్రిగారు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

శ్రీ కె. వెంకటరావు తేడా ఏమీలేదు.

శ్రీ పి సుందరయ్య :- అధ్యక్షా, మంత్రిగారు మాట్లాడుతూ ఆర్డినెన్సు వచ్చిననాటికి జాయింట్ ఫామిలీ ఆస్థి ఏది ఉన్నదో, అది ఆ లెక్కలలో యివ్వాలని స్పష్టం చేశారు ఆ అర్థం దానిలో యిమిడి ఉన్నదని అంటున్నారు ఆ అనుమానానికి తావు లేకుండా చేయమని ఈ సవరణ యివ్వబడ్డది అది explicit గా ఎందుకు చెప్పకూడదో నాకు అర్థం కావటంలేదు. నేను పెట్టిన సవరణకు అర్థం వేరు. జాయింటు ఫామిలీలో ఉంటున్నవారికి స్వంతఆస్థి - అనగా స్త్రీధనంగా వచ్చినదిగాని, gift గా వచ్చినదిగాని, యింకేరకంగా వచ్చినదిగాని individual property ఉంటే - అది joint family ఆస్థిక్రింద రాదు. దానికి వ్యక్తిగతంగా లెక్కలు యిచ్చుకోవలసి యుంటుంది అది joint family ఆస్థిలో చేరదు. అదికూడా యివ్వవలసియుంటుంది అని ఆ సవరణ. అది పోయింది. ఈ సవరణ వేరు. ఈ ఆర్డినెన్సు జారీచేసిన నాటికి ఉన్న జాయింట్ ఫామిలీ ఆస్థియొక్క లెక్క యివ్వాలని మంత్రిగారు అంటున్నారు. అయితే యిది జాయింట్‌పట్టా ఉన్నవారికి వర్తించదు, జాయింట్‌ఫామిలీ ఆస్థినే లెక్కలలో చూపించాలని చెపుతున్నప్పుడు దానిని explicit గా పెట్టితే ఏమి తప్పో తెలియదు. ఆక్టులో స్పష్టంగా ఉంటే అందరికీ తోడ్పడుతుంది కాబట్టి ఈ సవరణ అంగీకరించాలని కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, సుందరయ్యగారి ఆర్గ్యుమెంటుతో ఏకీభవిస్తానుగాని అది అవసరంలేదు వారు చెప్పినది, ఒకే జాయింటు ఫామిలీకి చెందినవారు, ఒక పట్టాలో అయిదారుగురు ఉండవచ్చును, నూరు ఎకరాలు ఒకరిపేర ఉంటే ఇతర జాయింటు ఫామిలీకి చెందినవారి హోల్డింగు దానిలో ఉంటుంది కనుక, అందులో తమతమ వాటాలు ఎంత ఉన్నవో నిరూపించుకొనవలెను దీనికి జాయింటు ఫామిలీ ప్రాపర్టీకి సంబంధం లేదు జాయింటు ఫామిలీ ప్రాపర్టీ ఎంత ఉన్నప్పటికీ దానిని చూపించవలసిన ఆవశ్యకత ఉన్నది ఈ క్లాజులోని explanation యొక్క ఉద్దేశం individuals యొక్క భాగాలు స్పష్టీకరించే విషయం కనుక ఒకే జాయింటు ఫామిలీకి సంబంధించి యీ explanation idea లోనే లేదు. అందువల్ల వారి సవరణ redundant అవుతుంది వారుచెప్పినభావం మళ్ళీ చెపుతున్నాను, జాయింటు ఫామిలీలో ఇతర స్వంతఆస్థులు చూపించనక్కరలేదు ఒకే కుటుంబంక్రింద undivided గా ఉన్న ఆస్థికి ఒక్కుమ్మడిగా లెక్క యివ్వవలసిన అవసరం ఉన్నది వారుకోరేదీ అదే, మేము కోరేదీ అదే అందుచేత యీ అమెండ్‌మెంట్ ఈ explanationలో అనవసరమని మనవిచేస్తున్నాను

*Mr Speaker* The question is

'In Explanation to sub-clause (a) of Clause 2, after the words 'jointly' *insert* the following words—'

"but who are not members of the joint family "

The amendment was negatived

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I beg to move
'That in sub-clause (a) of Clause 2, *delete* the following words–
"to which this Act applies"

*Mr Speaker* Amendment moved

*Sri Pillalamarri Venkateswarlu*. "Holding means a parcel or parcels of land held by a landholder in one or more villages in the same district or different districts to which this Act applies." అని ఉన్నది

ఈ యాక్టును ఆంధ్రప్రాంతమునకు మాత్రమే పరిమితము చేశారు కాని తెలంగాణా ప్రాంతములో భూమి ధరలు చౌకగా ఉండటంవల్ల, ఆంధ్ర ప్రాంతంలోని అనేకమంది తెలంగాణాప్రాంతంలో భూములు కొనుక్కున్న ఘటనలు చూస్తున్నాము. ఈ విధంగా తెలంగాణాలో భూములు కొనుక్కున్న

వారు కొద్దిమంది మాత్రమేకాదు లార్జ్ స్కేల్‌లో తెలంగాణాలో భూములు కొనుక్కోవటం జరుగుతున్నది ఎవరైనా ఆంధ్రలో పది ఎకరాలు అట్టేపెట్టు కొని, అంతకన్నా ఎక్కువ ఉన్న భూమంతా అమ్ముకొని, తెలంగాణా ప్రాంతంలో కొనుక్కొంటే, అటువంటివారికి యీ చట్టం వర్తించదు తెలంగాణా ప్రాంతంలో భూములు కొనుక్కున్నవారు చాలామంది ఉన్నారు సరిహద్దు జిల్లాలలో చూస్తే,ఒకరికి కొన్ని ఎకరాల భూమి ఆంధ్రప్రాంతానికి చెందిన గ్రామంలో ఉంటుంది. మరికొన్ని ఎకరాల భూమి తెలంగాణా ప్రాంతానికి చెందిన గ్రామంలో ఉంటుంది నందిగామ తాలూకాలో ఆవిధంగా భూమిగలవారు చాలామంది ఉన్నారు నందిగామ తాలూకా విషయంలో చూస్తే, అటువంటి ఉదాహరణలు చాలా ఇవ్వగలను ఒక పెద్ద భూస్వామికి 500 ఎకరాలు ఆంధ్రలో ఉంటే, ఇంకో 500 ఎకరాలు తెలంగాణా ప్రాంతంలో ఉండటం జరుగుతుంది కాబట్టి ఇవన్నీ కవర్ చేయాలంటే ఏమి చేయాలి ? ఈ చట్టాన్ని ఒక్క ఆంధ్రజిల్లాలకు మాత్రమే వర్తింపజేస్తే సరి పోదు తెలంగాణా ప్రాంతంలోని జిల్లాలలో ఉన్నటువంటి భూమి కూడ లెక్కలోకి తీసుకొని, మొత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న భూమిని లెక్కలోకి తీసుకువచ్చి ప్రభుత్వానికి ఇవ్వాలి అని అన్నప్పుడే. యీ చట్టము పరిపూర్ణం అవుతుంది లేకపోతే యీ యాక్టుయొక్క ఉద్దేశం నెరవేరదు కాబట్టి, నేను ప్రవేశపెట్టిన యీ సవరణను ఒప్పుకోటానికి మంత్రిగారికి ఏవిధమైన అభ్యంతరము ఉండదని అనుకొంటాను నేను చెప్పిన ఫేక్ట్స్ ఇంతకు ముందు మంత్రిగారిదృష్టికి రాలేదని అనుకొంటాను. నందిగామ తాలూకాలో యీ విధంగా ఎంతమందికి ఇతరప్రాంతంలో భూములు ఉన్నాయో, విచారణ చేయటం ప్రారంభిస్తే, చాలామందికి ఉన్నట్లు బోధపడుతుంది చాలామందికి సరిహద్దుగ్రామాలలో భూములు ఉన్నాయి కాబట్టి, మంత్రిగారు నా సవరణ ఒప్పుకుంటేగాని, యీ చట్టం వారందరికి వర్తించదు కనుక నా సవరణ ఒప్పుకోవాలని మంత్రిగారిని కోరుతున్నాను.

**మిస్టర్ స్పీకర్** : ఒక విషయం చెప్పండి In the same district or different districts అన్నారు అంటే మీరుచెప్పేది, any district anywhere in India అనా ?

**శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు** : మన లెజిస్లేషన్ మన ప్రాంతానికి చెల్లుతుందిగాని, ఇతర రాష్ట్రాలకు మనం లెజిస్లేట్ చేయగలమా ?

మిస్టర్ స్పీకర్ ఈ Act పాత ఆంధ్రరాష్ట్రానికి చెందుతుంది అన్నారు ఆ జిల్లాలలో ఉన్న భూమి చూపించమన్నారు పోతే, పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారు "పాత ఆంధ్రరాష్ట్రం" అన్నది తీసి వేసి any district or districts అని ఉంచాలని అంటున్నారు Any district or distrcts అంటే, ఇండియాలో ఎక్కడైనా, అనా ? లేక సభ్యులు ఆంధ్రప్రదేశ్ అని ప్రత్యేకంగా చేస్తారా ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఆంధ్రప్రదేశ్ అన్న పదం చేర్చటం, చేర్చకపోవటం అన్నది ప్రభుత్వం ఆలోచించి నిర్ణయం తీసుకుంటుందని మేము దానిని అట్లాగే వదిలివేశాము ఇప్పుడు తమిళనాడు సరిహద్దులలో చూడండి, ఒరిస్సా సరిహద్దులలో చూడండి ఒకరికి కొన్ని భూములు ఆంధ్ర ప్రదేశ్‌లో ఉంటే, కొన్ని భూములు మద్రాసు స్టేటులో ఉంటాయి అట్లాగే ఒరిస్సాలోను ఉండవచ్చు అవన్నీ టెక్నికల్ మేటర్స్ అవుతాయి డిటెయిల్స్ ఎర్కవుట్ చేయటాన్ని, ప్రభుత్వానికి వదిలిపెడితే ప్రభుత్వం వాటిని సవరించి సంస్కరిస్తుంది అన్ని డిటెయిల్స్ మనం చట్టంలో పెట్టటం వీలుకాకపోవచ్చు కాబట్టి, ప్రభుత్వానికి అన్నివిధాలా అవకాశం కల్పించాలనే ఉద్దేశంతో యీ సవరణ ప్రవేశపెట్టటం జరిగింది

మిస్టర్ స్పీకర్ అది రీజనబుల్ కావచ్చు అదికాదు నేను అడుగుతున్నది ఇప్పుడు సభ్యులు చెప్పారు, "నందిగామ తాలూకాలోని వారికి మధిరతాలూకాలో భూమి ఉండవచ్చు" అని. అట్లాగే వారిఆస్తి బొంబాయిలో కూడ ఉంటే ఏమవుతుంది ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు మంత్రిగారు మిగిలిన ప్రాంతాలుకూడా తీసుకోటానికి వీలుంది, తీసుకొందామంటే, మాకు అభ్యంతరంలేదు "కాదు, వాటి విషయం పట్టించుకోము" అంటే, కనీసం మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అంతటకూడ యీ చట్టం వర్తించేటట్లు చేయటానికి వీలుగా నా సవరణను అంగీకరించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను

శ్రీ పి సుందరయ్య · అధ్యక్షా, మంత్రిగారు యీ సవరణనైనా, జాగ్రత్తగా ఆలోచించి అంగీకరించవలసిందిగా కోరుతున్నాను "తెలంగాణాలో సమగ్రమైన లెక్కలు ఉన్నాయి; కనుక ఆంధ్రప్రాంతానికి సంబంధించినంత వరకు ఈ చట్టం ఉంటే సరిపోతుంది" అని అన్నారు ఆంధ్రప్రాంతంలో మంత్రిగారు కోరుతున్న దేమిటి ? జాయింట్ కుటుంబాలలో, ఎవరెవరికి ఎంతెంత

భూమి ఉన్నది? ఎవరి పేర ఎంతభూమి ఉన్నది? అన్న లెక్కలు చెప్పవలసిందిగా రైతులను ప్రభుత్వంవారు అడుగుతున్నారు ఆంధ్రప్రాంతంలో ఇదివరకు సర్‌చార్జి వేసే విషయంలో, ఫిర్కాలో ఎవరెవరికి ఎంతభూమి ఉన్నదో చెప్పమన్నారు ఇప్పుడు ఆంధ్రప్రాంతంలోని పదకొండు జిల్లాలలో మొత్తం ఎవరెవరికి ఎంతెంత భూమి ఉన్నదో చెప్పమంటున్నారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారు ఆంధ్రప్రాంతంనుంచి అనేకమంది తెలంగాణాప్రాంతం వచ్చి భూములు కొనుక్కొంటున్నారని చెప్పారు ఆంధ్రాలో ఉన్నటువంటి చాలామంది డబ్బు గలవారు ఎక్కడపడితే అక్కడ భూములు కొనుక్కున్నారు ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ ప్రకారం వారు ఎక్కడపడితే అక్కడ కొనుక్కోవచ్చు ననుకోండి ఆంధ్ర ప్రాంతంలో బాగా డబ్బు ఉన్నటువంటివారు ముఖ్యంగా నిజామాబాదులో భూములు కొనుక్కొంటున్నారు అదేవిధంగా ములుగు ప్రాంతంలోకూడ కొనుక్కుంటున్నారు సరిహద్దు గ్రామాలలో కొనుక్కుంటున్నారు ఆ విధంగా అనేక ప్రాంతాల్లో భూమి కొనుక్కొంటున్నప్పుడు, ఒక్క ఆంధ్రప్రాంతంలో మాత్రమే ఎవరెవరికి ఎంతెంత భూమి ఉన్నది అని లెక్కలు సేకరిస్తే, అవి సమగ్రమైన లెక్కలుకావు ఈ చట్టం కేవలం పదకొండు జిల్లాలకు మాత్రమే పరిమితంచేసి, మిగతా జిల్లాలకు వర్తింపజేయకపోతే, యీ చట్టంద్వారా మనం సేకరించే లెక్కలు సమగ్రమైనవిగా ఉండవు కాబట్టి యీ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ అంతటకు వర్తింపజేస్తే, సమగ్రమైన లెక్కలు మనకు దొరకటానికి అవకాశం ఉన్నది మనం సీలింగ్ బిల్లు తీసుకువచ్చినా, ఏ బిల్లు తీసుకువచ్చినా, అది ఇతర రాష్ట్రాలకుకూడ అప్లయి చేయటానికి వీలుంది. ఎందుకంటే డోమసైల్ ఆంధ్రాలో ఉన్నది కాబట్టి, అతని ఆస్తి ఎంత ఉండాలి అన్నప్పుడు, ఇతర రాష్ట్రాలలో ఉన్న అతని ఆస్థిని కూడ మనం గుర్తించవచ్చు దానిని స్వాధీనం చేసుకొనే హక్కు మనకు లేకపోయినా, ఇక్కడ ఉన్న అతని ఆస్తికి పరిమితి పెట్టే విషయం కన్సిడర్ చేసేటప్పుడు, ఆ లెక్కలు తోడ్పడతాయి. కాబట్టి, సమగ్రమైన లెక్కలకోసం యీ అక్టులో "to which this Act applies" అన్నది ఉండటం అనవసరము అవుతుంది. ఇది ఉండటంవలన, అసలు యాక్టును తీసుకువచ్చిన ఉద్దేశ్యం సగం ఎగిరిపోయింది. "సగం ప్రాంతంలో ఉన్న ఆస్థిమాత్రం చెప్పండి, మిగిలిన సగం ప్రాంతంలో ఉన్న ఆస్థి చెప్పనక్కరలేదు" అంటే, యీ బిల్లుయొక్క అసలు ఉద్దేశమే చెడిపోతోంది కాబట్టి, మంత్రిగారి ఉద్దేశమైనా అమలులోకి తీసుకువచ్చేందుకు, యీ సవరణను ఒప్పుకోవలసిఉన్నది. ఒక పొరపాటు ఇక్కడ ఉన్నప్పుడు, దానిని మనం సవరించుకొనుటకు ప్రయత్నించకపోతే, యీచట్టము వల్ల ఉపయోగం ఉండదు. కాబట్టి, "different District or Districts" తీసివేసి

"in the same or different Districts in the Indian Union" అన్నది చేర్చాలి ఎవరికైనా భూములు మైసూరు రాష్ట్రంలో ఉండవచ్చు తుంగభద్ర ప్రాంతమునకు, మునీరాబాద్ ప్రాంతమునకు, మన ఆంధ్ర ప్రాంతంనుండి చాలామంది వెళ్లి భూములు కొనుక్కొంటున్నారు వారికి ఇక్కడ భూమిలేక అక్కడకు పోయి కొనుక్కుంటే, ఆ భూములయొక్క లెక్కలు ఇవ్వనవసరంలేదు కాని వాళ్లకు ఇక్కడ డోమసైల్ ఉండి, ఇక్కడ భూమి ఉన్నప్పుడు, యీ లెక్కలు ఇమ్మన్నప్పుడు, అక్కడఉన్న భూమికూడ కలిపి, మొత్తం భూమికి లెక్కలు అడగటం న్యాయంగా ఉంటుంది. ఎక్కడ భూమి ఉన్నా, మొత్తం ఇండియాకంతా యీ చట్టం వర్తించాలని చెబుతున్నాను ఇండియా అంతా ఒక దేశం కాబట్టి, అందులో మనం ఒక భాగం కాబట్టి, ఆవిధంగా చెబుతున్నాను ఇండియాలో ఎక్కడ ఆస్థి ఉన్నా తీసుకురావాలని మా ఉద్దేశము మంత్రిగారు దానిని ఒప్పుకోకపోతే, కనీసం మొత్తం ఆంధ్ర ప్రదేశ్‌కు సంబంధించిన లెక్కలు ఇవ్వాలని చెప్పటం సరైనటువంటిది, "ఇండియాలో ఏ జిల్లాలో ఉన్నాసరే" అని పెడితే బాగుంటుంది దానికి మంత్రిగారు ఇష్టపడకపోతే కనీసం ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడ ఆస్తి ఉన్నా చెప్పమనడం అన్నది, సెకండ్ బెస్ట్ అనుకొని దానిని మంత్రిగారు అంగీకరించవలసి ఉన్నది అట్లుగాక ఉన్నది ఉన్నట్లుగా ఉంచితేమాత్రం, మంత్రిగారు ఏ ఉద్దేశంతో అయితే, యీ బిల్లు తెచ్చారో, ఆ ఉద్దేశం పూర్తిగా విఫలం అవుతుందని చెబుతూ, యీ సవరణను అంగీకరించవలసిందిగా కోరుతున్నాను

శ్రీ ఎల్ లక్ష్మణదాస్ పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ సర్, ఆంధ్ర ప్రాంతంలో ఉన్న భూమి గురించి, యీ లెఖ్ఖల సేకరణ చేస్తున్నారు వారు చెప్పిన ప్రకారంగా ప్రక్కన రాష్ట్రాలలో కూడ భూములు కొనుక్కోవటం ఉన్నది మన పొజిషన్ చూస్తే, చంద్రమండలంలో కూడ భూములు కొనుక్కోవటం, అమ్ముకోవటం......

*Mr Speaker*: There is no point of information.

శ్రీ ఆర్. లక్ష్మీనరసింహందొర (టెక్కలి) - మిస్టర్ స్పీకర్, సర్, సుందరయ్యగారు అన్నదాంట్లో పాయింట్ ఉన్నదనుకొంటాను సోషలిస్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటీ ఎస్టాబ్లిష్ చేసేఉద్దేశంతో మనంముందుముందు చెయబోయే లెజిస్లేషన్ కొరకు యీ లెఖ్ఖలు సేకరిస్తున్నాము సుందరయ్యగారు శెలవిచ్చినట్లు ఒకఆసామి తెలంగాణాలో వందఎకరాలు కొనుక్కోవచ్చును. లేక ఇక్కడ వ్యాపారం చేస్తున్న ఆసామికి బొంబాయిలో 500 ఎకరాలు

ఉండవచ్చును, కాని ఆ ఆసామికి ఇక్కడ 5 లేక 10 ఎకరాలు మాత్రమే ఉండవచ్చును, అలాంటి సందర్భాలలో, ఇతర రాష్ట్రాలలో ఉండే భూమికి మనం లెజిస్లేషన్ చేయకపోయినా, ఆ ఆసామి మన స్వాధీనంలో, మన జూరిస్ డిక్షన్‌లో లొంగే పర్యంతమైనా మనం లెజిస్లేషన్సు చేయటానికి అవకాశం ఉంటుందికనుక, యీ విధంగా లెఖ్ఖలు సేకరిస్తే బాగుంటుందను కొంటున్నాను సోషలిస్టిక్ ప్యేట్రన్ ఆఫ్ సొసైటీ ఎస్టాబ్లిష్ చేయాలనే ఉద్దేశమే మనకు నిజంగా ఉంటే ఇది ఒక ఆంధ్రప్రాంతానికే ఎందుకు పరిమితం చేయాలి ? ఆ ఉద్దేశం లేకపోతే బాధలేదు ఏదో లెఖ్ఖలు తీసుకోవచ్చు

మిస్టర్ స్పీకర్ అనగా ఏమిటంటే, బిల్లులోని "To which this Act applies" అనే మాటలు తీసివేసి "Same district, or districts in Indian Union" అని సవరణ చేయాలని అంటున్నారు

శ్రీ ఎమ్. వెంకటరాజు (బాపట్ల). అలా అయితే ఇంగ్లండులో గాని, అమెరికాలో గాని ఆస్తులుంటె, అప్పుడేమి చేస్తారు ?

మిస్టర్ స్పీకర్ అవి అయితే మనము ఏమి చేస్తాము ? అవి వదిలి వేయాల్సిందే. ప్రస్తుతము ఏమి చేయటానికి వీలుకాదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) అధ్యక్షా, ఈ సవరణను నేను బలపరుస్తున్నాను ఇందులో ఒక ప్రధానమైన ఉద్దేశ్యము ఉన్నది ఏమిటంటే, తెలంగాణాలో భూసంస్కరణలు జరిగాయి Protected tenant కు తన భూములు అమ్ముకోటానికి అభ్యంతరములేదు ఆంధ్రప్రాంతమునుంచి కొంతమంది వచ్చి యిక్కడి ప్రాంతములో ఎక్కువగ భూములు కొనుక్కుంటున్నారు అవి కూడ యీ లెక్కలలోనికి చేర్చకుండా పోయేటట్లయితే అవి తప్పు లెక్కలవుతవి అప్పుడు కష్టమువస్తుంది లక్ష్మీనరసింహం దొరగారు చెప్పినట్లు మనము అనుకునే Socialistic Pattern of Society ని ఏర్పాటు చేసే సందర్భముతో దానిని పూర్తిగా బలపరిచే పద్ధతిలో ఉండాలని అంటే కనీసము ఆ కొనుక్కున్న వ్యక్తికి ఎంతభూమి ఉన్నదో ప్రభుత్వానికి తెలియకపోతే వీలు లేదు అలాంటప్పుడు యీ Act apply కానప్పుడు గూడ ఆయనకు ఉన్న భూమియొక్క లెక్కలు అయినా ప్రభుత్వము తెలుసుకునిఉంటే మంచిది ఏమైనప్పటికినీ jurisdiction question రావచ్చు కాని ఆయన declaration ఇస్తున్నాడు. Declaration చేస్తున్నప్పుడు అందుతో వచ్చేచిక్కు ఏమీఉండదు

ఇప్పుడు యీ Act ను extend చేయకపోతే పరవాలేదు కాని Act లో ఉన్న effect వల్ల చాలామంది రాయలసీమకు, తెలంగాణాకు వెళ్ళి అక్కడక్కడ చాలా భూములు కొనుక్కుంటున్నారు మీరు సెలవిచ్చినట్లు, యితర రాష్ట్రాలకుపోయి కొన్నప్పుడు, యీ Act యితర రాష్ట్రాలకుకూడ extend చేయడము తప్పనిసరి అవుతుంది. గనుక ఆ ప్రకారము యీ యాక్టు వర్తించేటట్లుగచేస్తే, మీ సలహా ప్రకారము దానిని మేము తప్పకుండ అంగీకరిస్తాము ప్రభుత్వముకూడ దీన్ని అంగీకరిస్తే మంచిది

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, ఇప్పుడు ఏ ఒక్క విషయములోకూడ నాకు అనుమానము లేదు Socialistic Pattern of Society పద్ధతిమీద మన భారతదేశమును నడిపించాలనే విషయములో నాకు కలలోనైనా అనుమానము లేదు కాని యీ Census Bill వల్ల అది achieve అవుతుందా అనే విషయము వేరు అక్కడ మాత్రము లక్ష్మీనరసింహందొరగారు చెప్పినదానితో నేను ఏకీభవించటానికి వీలులేదు ఈ బిల్లువల్ల Socialistic Pattern of Society ని మనము create చేయటానికి ప్రయత్నము చేయడములేదు అది జరిగేటటువంటి విషయముకూడ కాదు Socialist సమాజ స్థాపనను గురించిన విషయంమీద మనము చేయదలచుకున్నామనే విషయములో నాకు కలలోనైనా అనుమానములేదు. ఈ అనుమానము లక్ష్మీనరసింహం దొరగారికి కూడ లేదని అనుకుంటాను.

ఇకపోతే మరొక విషయము ఉన్నది ప్రతిదానికి ఒక్కొక్క fact మాత్రము ఉన్నది ఉదాహరణ చెప్పాలంటే నందిగామ మొదలైన సరిహద్దు తాలూకాలలో పాత ఆంధ్రరాష్ట్రములో ఉన్నవారికి తెలంగాణలో భూములు ఉండవు, తెలంగాణలోనివారికి పాత ఆంధ్రరాష్ట్రములో భూములు ఉండవు ఇది వాస్తవమైన విషయము అక్కడ యిదివరకు నివాసులుగా ఉన్నవారు కొంతమంది తెలంగాణప్రాంతమునకు వచ్చి భూములు కొనుక్కున్నవారు ఉన్న మాట కూడ నిజమే అలాంటప్పుడు ఫలానావారికిఉన్న భూములను ఈ లెక్కల లోనికి తీసుకునివస్తే న్యాయముగ ఉంటుంది అనే దానికి నాకు ఏమాత్రము కూడ సందేహములేదు కాని యిలాంటి విషయములలో ఒక్క practical difficulty ఉన్నది ఆ difficulty వల్ల అది అంగీకరించటానికి వీలు కలగడము లేదు. ఆ difficulty ఇది : ఇక్కడ తెలంగాణలో భూములు కొనుక్కున్నటువంటివారు, వారు కొన్న ఆస్తి యొక్క సర్వే నెంబర్లతో సహా లెక్కలలో చూపించవలసి ఉన్నది కాని హైదరాబాదు చట్టములోని Sec 47 క్రింద

యిప్పుడు యీమధ్య జరిగినటువంటి భూముల కొనుగోలు వ్యాపారమంతయు unauthorised అవుతుంది ఈ విధముగ జరిగిన transactions అన్నింటిని legal అని ప్రభుత్వము యింకా ఒప్పుకోవడం లేదు ఈ విషయమును గురించి ప్రభుత్వము ముందు ఏమిచేయబోతుందో గాని, ఏదో చేయాలని మాత్రం అనుకొంటున్నది తనది కాదు అని ప్రభుత్వం నిర్ణయించే ఆస్తి తనదేనని నిరూపించే ముందు indirect method of circumventing Sec 47 of the Hyderabad Tenancy Act దీనికి అడ్డమువస్తున్నది అందువల్ల opposition party వారు యీ విషయములో యిచ్చిన సలహా దృష్టిలో పెట్టుకుని, ఒక్క పని మాత్రము చేస్తాము అది రాబోయే legislation లో బిల్లు పెట్టేటప్పుడు అక్కడ, ఇక్కడ ఉన్న భూమికంతటికినీ కలిపిన భూమికి ceiling apply అవుతుందిఅనే provision ఆబిల్లులో తప్పకుండ జ్ఞాపకం పెట్టుకుని చేర్చుతాము అని నేను మనవిచేస్తున్నాను లెక్కలకు సంబంధించినంత వరకు యీనాటి సవరణ నష్టములేనటువంటి విషయమే దీనిని ఒప్పుకోటానికి నాకు వ్యక్తిగతముగా గాని, ప్రభుత్వానికి గాని ఏమాత్రము కూడ అభ్యంతరములేదు కాని యిప్పుడు నేను చెప్పిన difficulty వల్ల యీసవరణ అంగీకరించలేకపోతున్నాను నేను అమలాపురము వాడిని: అక్కడ నాకు ఉన్న నాలుగు ఎకరాలు అమ్ముకునివచ్చి, నిజామాబాదులో 30 ఎకరాలు కొనుక్కున్నాను అనుకోండి ఈ 30 ఎకరాలు నేను వ్యవసాయముచేసుకుంటూ ఉన్నమాట నిజమే కాని ఈ 30 ఎకరాలకు ఉన్న title ను నాకు అమ్మిన ఆయనకు Sec 47 క్రింద హక్కులేదు అందులోఉన్న provision ఎట్లా ఉన్నదంటే కలెక్టరు యొక్క perrmission లేనిదే ఎవ్వరుకూడ అమ్మకూడదు కొనగూడదు. కొనడంగాని, అమ్మడంగాని జరిగితే, అది చెల్లదు అనిఉన్నది. నాకు తెలిసినంతమటుకు నూటికి 99 transactions అలాంటివి జరిగాయి అందువల్లప్రభుత్వము యీ transactions recognize చేయాలా, లేదా అనేది మొదటిప్రశ్న, Act క్రింద చేయనక్కరలేదు. కాని practical difficultyని బట్టి చేయక తప్పదేమో. ఒకవేళ చేసేటట్లయితే కొన్నవారిదగ్గరనుంచి Registration fees, stamp fees అవి అన్నీ యివ్వలేదు. Sale contract ప్రయివేటు గనుక వాటివిషయములో ఆ fees వసూలు ప్రభుత్వము చేసుకోవాలా, లేదా అనేది ఒక పెద్ద సమస్యఉన్నది. అది తేలకుండా ఇక్కడ ఏర్పడిన పరిస్థితి ఏమిటంటే ఈ ప్రాంతంలో సంపాదించిన ఆస్తిని యిప్పుడు కోరేటటువంటి లెక్కలలోనికి చేర్చుకోవడంవల్ల అది ఒకవిధమయిన recognition అయితే కావచ్చు అందువల్ల అలాంటిబాధ తప్పించుకోటానికి యిప్పుడు యీ సవరణను accept చేయడములో కొంతకష్టముఅవుతున్నది ఇంకను దీనివల్ల కొంతభూమి escape అవ్వొచ్చునన్నమాటనిజమే. ఇంతకు ముందు నేను చెప్పినట్లు కొత్తగా సరిహద్దులలో

ఉండే అవతల ప్రక్కన కొన్నవారి భూమి escape అవుతుందన్నమాట నిజమే దానిని నోటు చేసుకొని, దానికి తగిన ఏర్పాటు చేయటానికి ceiling వ్యవహారము యొక్క effect అప్పుడు వస్తుందిగాని ముందుగా ఏమీరాదు దానికి సంబంధించిన వ్యవహారము వచ్చినపుడు, ఇప్పుడు opposition సభ్యులు చెప్పినటువంటి విషయాలు అన్నీ దృష్టిలో పెట్టుకొని యిప్పుడుచేర్చమన్న provision అప్పుడు చేర్చి అమలులోనికి తీసుకునివచ్చే ఏర్పాటు చేస్తామని నేను మనవి చేస్తున్నాను అందువల్ల ప్రస్తుతము యీ amendment అనవసరమని మనవి చేస్తున్నాను

*Sri K L Narasimha Rao* Mr speaker, Sir, on a point of personal explanation, Hyderabad Tenancy Act లోని 47 వ సెక్షనును గురించి రెవిన్యూమంత్రిగారు refer చేశారు ఈ సందర్భములో నేను కొద్దివిషయములు వారిదృష్టికి తేదలచుకున్నాను ఏమిటంటే దానిని అనుసరించి భూమి కొనుక్కున్న వ్యక్తి దానిని తన ఆస్తిగా నిరూపించడములో అది అడ్డము వస్తున్నదని మంత్రిగారు చెప్పారు అది correct కాదు ఈ మధ్య ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఖాస్రా ఫారముల దృష్ట్యా ఏ భూమికి అయితే పట్టా హక్కులు కల్పించబడినవో, అది register కాలేదుకాబట్టి వాటిని తాత్కాలికంగా పక్కకుఉంచాలి అనే ఉత్తరువులు జారీచేయబడినవి అది న్యాయమా, అన్యాయమా అనే చర్చ జరుగుతున్నది ఆ విషయములో ఎట్లా పరిష్కారము చేయాలి అనేది ప్రభుత్వము ఆలోచిస్తున్నది. ఒక వ్యక్తి ఆ భూమి కొనుక్కున్నాడు మంత్రిగారు చెప్పేది నిజమే అయితే, ఆయన రిజిష్టరు చేయించుకోలేదు రిజిష్టరు అవసరము అయితే చేయించుకొనేవాడే కాని ఆయన document మాత్రము వ్రాయించుకున్నాడు. హక్కులు మారినవి కబ్జా తీసుకున్నాడు. సేద్యము చేస్తున్నాడు. అటువంటి వ్యక్తికూడ లెక్కలు తెలుపడములో అభ్యంతరము ఎందుకు ఉండాలో నాకు అర్థము కావడము లేదు. అంతేకాకుండా register చేయించుకున్నవికూడ చాలా ఉన్నవి. ఖాస్రా form ననుసరించి రిజిష్టరు లేకుండా వేటికిఅయితే transfers జరిగినవో వాటిని మాత్రమే తాత్కాలికంగా పక్కకు పెట్టివుంచే వాటి విషయములో ఏమి చేయాలి, వారివద్దనుంచి registration fees వగైరాలు తీసుకోవాలనేది ప్రభుత్వము ఆలోచిస్తున్నది ఇది ఒకవిషయ మనుకోండి అయినప్పటికినీ వారికి హక్కులు ఏవి అయితే దొరికినవో, వాటిని cancel చేయడము ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యము కాదు. అయితే ప్రభుత్వానికి రావలసిన ధనము రాకుండా

transfer అయినదేమో కాని, దానినిగురించి ఆలోచించబడుతున్నది అందు వల్ల మంత్రిగారు చెప్పిన అభ్యంతరము సరియైనదికాదని అనుకుంటాను

శ్రీ కె. వెంకటరావు నరసింహారావుగారు ఆ విధముగ అనుకొంటే నా కేమి బాధలేదు Legal transfer of title గురించి Transfer of Property Act అని ఒకటి యున్నది దానిని యీ transfers satisfy చేయుటము లేదు ఖాస్రాఫారమ్‌లో ఉన్న entry దానంతట అది 'legal' కాదు అందు వల్ల అది legal document కాదు ఆ వ్యక్తి నిజముగ ఆ భూమిని కొను క్కొని ఉండవచ్చు డబ్బుకూడ యిచ్చి ఉండవచ్చు, అది ప్రభుత్వము recognise చేయాలి. ఖాస్రాఫారమ్‌లో పెట్టుకోవాలి దానికి ఏదో scope కలుగ జేయాలి అది కలుగజేసేటంతవరకు అది అభ్యంతరమేనని నేను మనవిచేశాను కాని, నేను దానిమీద అలాంటి తుది అభిప్రాయము కూడా చెప్పలేదు ఇప్పుడు నేను point out చేసిన difficulty ని meet కావటానికి యీ major difficulty కూడ అడ్డు వస్తున్నది గనుక అలాంటి నష్టము మొత్తముమీద, ceilings పెట్టి నప్పుడు రాకుండా ఉండడానికి బందోబస్తు మనము చేయవచ్చు ఆ విషయ మును ప్రభుత్వము గుర్తించింది అని నేను ప్రభుత్వము తరఫున మనవి చేస్తు న్నాను.

శ్రీ పి. సుందరయ్య - మా సవరణ అంగీకరిస్తున్నామని ఇందులో ఒక saving clause పెట్టవచ్చునుగదా, Saving clause పెట్టేటప్పుడు యీ dispute లో ఉన్నటువంటివి ప్రభుత్వముయొక్క legal property గా గుర్తించక పోయినప్పటికిని, అది వేరే catagory క్రింద చూపించవచ్చును గదా ! ఆవిధముగ చూపించమని కోరుతున్నాను

శ్రీ కె. వెంకట్రావు - ఇప్పుడు యిది అంతా చేయాలంటే, అసలు ordinance నే change చేయవలసి ఉంటుంది ఈ ఒక్క చిన్న విషయము కొరకు మరల ఒక సం॥ ము extension అడగాల్సి ఉంటుంది ఇంతగలభా పడి మార్పుచేసినా ఏవిధమైన లాభం దానివల్ల తెచ్చుకొనలేకపోయే దానికంటె కొంచెము తప్పుచేసి అయినాసరే దానిని సవరించుకునేటటువంటి రీతిగా proper time వచ్చినప్పుడు అది చేయడము మంచిది. ఇక్కడ ప్రభుత్వానికి question of prestige అనేది ఏమీలేదు కాని అందులో కొంచెము implication ఉన్నదని నేను ఒప్పుకొన్నతరువాత గూడ opposition సభ్యులు అనవసరముగ యీ విషయాన్ని గురించి persist చేయడములో ఏమీ లాభము లేదని మనవి చేస్తున్నాను.

*Mr Speaker* The question is

"In sub-clause (a) of clause 2, *delete* the following words—"

"to which this Act applies"

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* I demand a division, Sir

The House then divided

Ayes 35 Noes 78

The motion was negatived

*Sri P Sundarayya* I beg to move

"Add the following at the end of sub-clause (b) of clause 2 —

"or forest land or land being used or reserved to be used for non-agricultural purpose "

*Mr Speaker* Amendment moved

శ్రీ పి సుందరయ్య అసలు land census మొదలు పెడుతున్నామని మంత్రిగారు చెప్పారు "ముందు ముందు ceiling పెడుతున్నాం, తెలంగాణాలో వున్నటువంటివి లెక్కలోకి రాకపోయినా మేము వాటినీ దృష్టిలో పెట్టుకుని రెండింటినీ కలిపి పెడతాం" అన్నారు "Ceiling కు ప్రాతిపదికగా లెక్కలు తీసుకుంటున్నాము అవి taxation కు ఉపయోగించుకోవచ్చు, సంఘవ్యవస్థలోని హెచ్చుతగ్గులను గురించి చూసుకోవచ్చు, అన్నిటికీ ఉపయోగిస్తుంది" అనవచ్చుకూడా, కాని ceiling పెట్టే బదులు యిప్పుడే మినహాయించారన్నమాట. ఈ లెక్కల ప్రకారం ఒక్క వ్యవసాయానికి పనికి వచ్చేటటువంటి, అంటే తోటలు వేయడానికి గాని, పంటపండించడానికి గాని పనికివచ్చే భూమి తప్ప మిగిలిన యే భూమికూడా యిందులో లెక్కలు చూపించనవసరం లేదని చెప్పారు పశువుల మేతకు పనికివచ్చే యే భూమీ యిందులో చూపించనవసరము లేదన్నారు. ఇప్పుడు "భూమి" అంటే Private forests వున్నాయి, అవి లెక్కలోకిరావు, ఎందుకంటే అవి cultivable waste కాదు; Pasture land కాదు. పండ్ల తోటలకుగాని, పంటలకు గాని ఉపయోగించే భూమికాదు. అట్టువంటి భూమిని మినహాయించడం అంటే యేమిటి? ఎక్కువ అడవు లున్నటువంటివాళ్లు తమకు యింత అడవి గల భూమి వుందని లెక్కలు చూపించవలసిన అవసరం లేదన్నమాట. Higher category లోకి

రాకుండా వాళ్ళ మొత్తం భూ పరిమితి తెలియకుండా పోయే పరిస్థితి ఏర్పడింది అకవి భూమి సంగతి ఒకటేకాదు ఇప్పుడు ప్రతి సంవత్సరం కూడా పట్టణాలు, గ్రామాలు పెరిగిపోతున్నాయి పట్టణానికి సమీపించి ఒక గ్రామంలో కొంతభూమి వుండవచ్చు హైదరాబాదు నగరంలో భవిష్యత్తులో ఇండ్లస్థలాలకు పనికివస్తుందని 5 ఎకరాలు 10 ఎకరాలు కొనుక్కొని అట్టేపెట్టవచ్చు ఇండ్లు కట్టుకుంటే అది వేరే Act క్రిందకు వస్తుందనే సంగతి వేరు. ఇండ్లస్థలాలక్రింద కొన్ని పెట్టి వుంటారు అదికూడా ఎందుకు చూపించకూడదు? ఒక వందగజాలో రెండువందలగజాలో కొనుక్కొని యిండ్లు కట్టుకోడానికి డబ్బులేక యిబ్బంది పడుతూండే వారి సంగతి కాదు. మొత్తం పరిమితి పెట్టవలసివచ్చినప్పుడు హైదరాబాదు నగరంలోనో విజయవాడ నగరంలోనో 5 ఎకరాలు, 10 ఎకరాలు వ్యాపారం చేయడానికి భూములు కొంటున్నప్పుడు ఆ భూములను కూడా లెక్కలోకి తీసుకుని చూపించమని చెప్పడానికి ప్రభుత్వం యెందుకని వెనుకంజ వేస్తున్నదో నాకు అర్థంకావడంలేదు. అందుచేత forest land కాని "land being used or reserved to be used for non - agricultural purposes" అనేవాటికి లెక్క చెప్పాలని నా సవరణ. ఒక Sugar Facatory పెడుతున్నారు అనుకోండి Sugar Facatory క్రింద పెట్టిన భూములు non - agricultural purposes క్రింద వస్తుందో లేక agricultural purposes క్రింద వస్తుందో define చేయనిదే కష్టమవుతుంది; అయితే sugar factory పెట్టిన భూములు agricultural అనకుండా factory క్రింద గుర్తించినపుడు Industrial property క్రింద గుర్తించడానికి అవకాశంవుంది ఈ పరిస్థితులున్నప్పుడు దీన్ని గురించి మన లెక్కలు పూర్తిగా సమగ్రంగా వుంచడానికి "any kind of land" అనేదివుంటే బాగుండేది ఇప్పుడున్న నిర్వచనానికి మరి రెండు సవరణలు పెట్టాను ఈ సవరణ సరిగావుంది. దీనికై వా మంత్రిగారు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె. వెంకటరావు దీనికి రెండు కష్టాలున్నాయి ఒకటి. వారనుకున్నట్లు యిది land census కాదు "A bill to provide for the collection of statistics of agricultural holdings" అన్నాం అసలు దీని మకుటములో మార్పు వస్తుంది. దీని ఉపయోగం కూడా మారిపోతుంది. వారి సవరణవల్ల అందువల్ల శ్రీ సుందయ్యగారు చేర్చదలచిన మాటలు "or forest land or land being used or reserved to be used for non - agricultural" అన్నదంట్లో యీ రెండోభాగం అసలు వర్తించదు. ఇంకో బాధ యేమిటంటే forest land అయినా అది agricultural land కాదు, దాని category వేరు దానిమీద

మనం చర్చతీసుకోవాలంటే తీసుకోవచ్చు కాని వారి సవరణవల్ల purpose of the Act నే మార్చవలసివస్తుంది It is not a gathering of census of everything, అందుచేత యీ category లోకి రాదు, కనుక అంగీకరించడానికి వీలులేదు ఐతే వారు pertinent doubtను వెలిబుచ్చారు Sugar factory గొడవవచ్చింది కొంత మంది తమకున్న భూమిని దానికి వశంచేసి ఆ భూమిని ceiling లోకి రాకుండా రక్షించుకునే యత్నం జరుగుతుందేమో, ఆ విధంగా దానిక్రింద రాదేమోనన్న భయాన్ని వెలిబుచ్చారు వారిభయం నిరాధారమైనదని మనవిచేస్తున్నాను Sugarcane plantation క్రింద వున్నటువంటి ప్రతిభూమీ కూడా agricultural land గా వస్తుంది యీ definition క్రింద అందుచేత అటువంటి అపోహకు అవసరంలేదు అది తప్పించుకోలేదు మిగిలిన non-agricultural land property అయినప్పటికీ యీ ordinance యొక్క, బిల్లుయొక్క ఉద్దేశ్యాలకు బహిర్గతంగా వున్న సమస్య కనుక యిదివిస్తృతం చేస్తున్నది కాబట్టి కష్టంగా వుందని మనవిచేస్తూ వారి సవరణలను withdraw చేసుకోవలసినదని కోరుతున్నాను

*Mr Speaker* The question is

Add the following at the end of sub-clause (b) of clause 2 —

"or forest land or land being used or reserved to be used for non-agricultural purposes "

The motion was negatived

శ్రీ పి. సుందరయ్య నా పేర ఉన్న ఇంకొక సవరణ ప్రతిపాదించ దలచుకోలేదు నా మొట్టమొదట సవరణ 'family holding' అనేది తీసివేసిన తరువాత 'interest in any share' అనేది అనవసరం కాబట్టి ప్రతిపాదించ దలచుకోలేదు

*Mr Speaker*. The question is

"That Clause 2 stand part of the Bill "

The motion was adopted

Clause 2 was added to the Bill.

*Clause* 3.

*Sri P Sundarayya:* I beg to move .

"In line 3 of sub-clause (1) of Clause 3, after the words 'twenty acres of land', insert the words 'or ten acres of wet land.' "

*Mr Speaker:* Motion moved.

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, సబ్ క్లాజ్ లో ఇలాఉంది

"Every landholder of a holding the total extent of which exceeds twenty acres of land on the date of commencement of this Act, shall within ninety days thereafter, furnish "

10 ఎకరాల మాగాణీకి సీలింగ్ పెట్టాలని మా ఉద్దేశ్యంకాదు 20 ఎకరాలు దాటినవారంతా లెక్కలు ఇవ్వాలని ప్రభుత్వం కోరింది సీలింగ్ 30 ఎకరాలు పెట్టాలా, లేక 50 ఎకరాలు పెట్టాలా అనేది నిర్ణయించటానికి ఈ లెక్కలు కోరుతోంది

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, దానికి వారు ఒప్పుకొన్నారు కదా !

శ్రీ పి సుందరయ్య 30 ఎకరాలకు ఒప్పుకోలేదు రు 3,600 ఆదాయం వచ్చేదానికి ఒప్పుకొన్నాము కోనసీమలలో సంవత్సరానికి రెండు పంటలు పండే కొబ్బరి, నిమ్మ, పసుపు, చెఱకు వేసే భూములకు 30 ఎకరాలనే దానికి మేము అంగీకరించలేదు ప్రతిఒక్కరికి భూమి ఇచ్చేటట్లయితే అప్పుడు 30ఎకరాలకు వున్నా మాకు అభ్యంతరముఏమీలేదు 20 ఎకరాలని అన్నపుడు 20 ఎకరాలు మెట్టభూమి వున్నవాడు లెక్కలు చూపించాలి 4, 5 ఎకరాలు మాగాణి వుండి, 15 ఎకరాలు మెట్టవున్న అతనుకూడా లెక్కలు చూపించాలి నిజామాబాద్ జిల్లాలో మెట్టభూమి లేకుండా అంతా మాగాణిచేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అక్కడ గూడా guaranteed registered wet land 20 ఎకరాలు వుంటే చెప్పాలి. Wet land కు definition వుంది మెట్టపంటలకు అప్పుడప్పుడు నీరు పెట్టుకొన్నా అది wet land క్రిందకు రాదు Wet land నిర్వచనం క్రింద 20 ఎకరాల wet land వుంటేనే అతను రిజిష్టరుచేయాలి లెక్కలు చెప్పాలి. లేకపోతే అవసరంలేదని చెప్పటం ఒక discrimination క్రిందకు వస్తుంది. 20 ఎకరాల మెట్ట ఉన్నా బాగా ఆదాయంవస్తున్నా, 5, 6 రెట్లు ఆదాయం వస్తున్నా, వారు మాత్రం ఎంత భూమి వుందో చెప్పనక్కరలేదు మరి ఇది దేనికి ఉపయోగిస్తుందో నాకు అర్థంకావటంలేదు సీలింగ్ ను దృష్టిలో పెట్టుకొని ఈ లెక్కల సేకరణ ప్రాతిపదికగా తీసుకొంటున్నామని చెప్పారు తోటభూములు ఏవో, రెండు పంటలు పండే భూములు ఏవో, సారవంతమైన భూములు ఏవో, నల్లరేగడి భూములు ఏవో, ఎర్రభూములు ఏవో మనం ముందు చూచుకోవాలి. తెలంగాణాలో లాండ్ కమీషన్ వారు ఆ వివరాలు కొంతవరకు సేకరించారు. ఆంధ్రరాష్ట్రములో కూడా ఈవిధముగా లెక్కలు [illegible] వారు అంటున్నారు. ఎంత సమగ్రమైన లెక్కలు తీసుకురావాలో

తెల్పటానికే మేము ఈ సవరణ తెచ్చాము మెట్ట, మాగాణి అన్ని కలిపి 20 ఎకరాలంటె లాభంలేదు 20 ఎకరాలు మాగాణివున్నా 10 ఎకరాలు మాగాణివున్నా లెక్కలు ఇవ్వాలనేదే నా సవరణ ఈ చిన్న సవరణను మంత్రి గారు అంగీకరించాలని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా, వారు చెప్పినప్రకారమే వ్యవహారము జరిగితే తప్పకుండా అంగీకరించేవాడిని వున్న అనుభవాన్ని బట్టి 20 ఎకరాల మాగాణి family holding అయితే దానికి అధమపక్షం 3, 4 రెట్లు మెరక భూమివుంటుంది ఇప్పుడువున్న శాసనం ప్రకారం family holding వుండాలా? వుంటే ఎంత వుండాలి అనేది నిర్ణయమవుతుంది మెరకకు, పల్లానికి వున్న సంబంధాన్ని బట్టి రేట్లను నిర్ణయించటానికి లాండు కమిషన్ ఇచ్చే కార్యక్రమంలో provide చేస్తాము అది హైదరాబాద్‌లో జరిగింది. నా సోదరులు యమ్ నరసింగరావుగారు ఆ కమిషన్ ప్రెసిడెంటు వారు తిరిగి ఫలానా వలానా ఏరియాలలో వున్న భూములను చెప్పారు 31 ఎకరాలు సీలింగ్ వున్నట్లయితే కొన్నిచోట్ల మెరక భూములు 270 ఎకరాలువున్నవి Quality ని బట్టి స్వరూపాన్నిబట్టి ఆ నిర్ణయం చేయటం జరిగింది 20 ఎకరాల మెట్టకు 20 ఎకరాల మాగాణికి సీలింగ్ అనే అభిప్రాయం వున్నప్పుడు అందులోని సుఖదుఃఖాలు తెలిసివుండేవి దానిలో ఆ relationship ఈ Standard Act of Reference లో dry acre కు wet acre కు సంబంధం ఏమిలేదు కనుక సుందరయ్యగారు చెప్పిన 'ఆవశ్యకత' ఏర్పడదని, అంతగా ఏర్పడితే అప్పుడే చర్చించుకోవచ్చుని, ఎవరివద్ద 20 ఎకరాలు వుంటే వారే లెక్కలు చెబితే బాగుంటుందని నేను అభిప్రాయపడుతూ వారి సవరణను నేను అంగీకరించటం లేదు

*Mr Speaker* · The question is

"That in line 3 of sub-clause (1) of Clause 3, after the words 'twenty acres of land', insert the words 'or ten acres of wet land' ".

The motion was negatived.

మిస్టర్ స్పీకర్ . Cl 3 sub clause లో 1 లో 90 రోజులకు బదులు 31-3-58 వుండాలనేది సుందరయ్యగారి సవరణ యింకొకటి move చేయ వలసియున్నది.

శ్రీ పి. సుందరయ్య ముఖ్యమైన సవరణలు పోయిన తరువాత నెల రోజులైనా ఫరవాలేదు ఏదో జరిగిపోతున్నప్పుడు ఈసవరణకుకూడ ఉపయోగ పడదు అందుచేత నేను దీనిని ప్రతిపాదించటంలేదు.

మిస్టర్ స్పీకర్ Clause 3 లో sub clause 3, కు నాల్గుసవరణలు ఒకే అర్థగాం వున్నాయి సుందరయ్యగారి ఒకటి, గోపాలకృష్ణయ్యగారు కొత్త క్లాజు పెట్టినప్పటికీ అదే అర్థంవుంది శ్రీరామ్మూర్తిగారిది, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారిది ఒకటి మొత్తం 4 వున్నాయి సుందరయ్యగారిది చదువుతాను

I am sorry, the amendment of Sri P Sundarayya is different from the amendments of others So, Sri Sundarayya will move his amendment first

*Sri P Sundarayya* I beg to move

Add the following at the end of sub-clause (3) of Clause 3 —

"such declaration of holding by land-holder shall be deemed to be final and that any other land legally owned by him but not included in the declaration will be taken as having been surrendered to the State by the land-holder of his own free volition with no claim for compensation or any other benefit from the State

Explanation It is for the land-holder to prove his legal right (title) to any land so declared, if any dispute or other arises "

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, క్లాజు 3 తరువాత వేరే క్లాజు క్రింద అయినా లేక సబ్ క్లాజు క్రిందగాని పెట్టవచ్చు కాని మంత్రిగారు అంగీకరించే టట్లుగా ఉంటే పేరునకు నెంబరువేసేది అంత సమస్యకాదు నా సవరణ ఇది.

"Such declaration of holding by land-holder shall be deemed to be final and that any other land legally owned by him but not included in the declaration will be taken as having been surrendered to the State by the land-holder of his own free volition with no claim for compensation or any other benefit from the State

Explanation —It is for the land-holder to prove his legal right (title) to any land so declared, if any dispute or other arises."

అనేది పెట్టాను. ఇప్పుడు మనం లెక్కలు కోరుతున్నాము. ఏ ఉద్దేశ్యంతో కోరుతున్నామని అడిగితే ఏమిలేదని మంత్రిగారు చెబుతారు సవరణ అన్నీ పూర్తయిన తరువాత యింకా స్పష్టమవుతుంది. ఏ ఉద్దేశ్యంతో తీసి

కొన్నా సరే ఆ లెక్కలు ఖచ్చితంగా వుండాలనేదే మనకోరిక లెక్కలు సరిగా లేకపోతే రోజుకు రు 500 జరిమానా అని చెప్పారు లెక్కలు సరిగా లేవని ఎవరు రుజువు చేయాలి? Goverment ఈ లెక్కలు సరిగా లేవని కోర్టులో కేసు పెట్టాలి అది ఋజువు అయితే రోజుకు రు 500 చొప్పున జరిమానా పడుతుంది కాని executive authority గా వీరు చేయగల్గింది ఏదీలేదు "ఎక్కడెక్కడ ఏఏ భూములు వున్నాయో గవర్నమెంటుకు ఎట్లా తెలుస్తుంది? ఎవరు విచారిస్తారు? కేసులు ఎవరు పెడతారు? పెనాల్టీ అనేది కేవలం బెదిరింపు తప్పితే ఏమీలేదు" అని చాలామంది అనుకొంటూవుంటారు అందు చేత దానివల్ల ఉపయోగం లేదు ఆంధ్రజిల్లాలకు సంబంధించినంతవరకు కుటుంబమునకు ఎంత భూమి వున్నదనిగాక, వ్యక్తికి ఎంతభూమి వున్నదని లెక్కలు చెప్పమంటే ఎవరు చెబుతారు? అలా చెప్పనివారు జరిమానా కాకుండా, ఆస్తిపై గల అన్ని హక్కులు పోగొట్టుకొంటారని ఈ బిల్లులో చెప్పినప్పుడే లెక్కలు వివరంగా వచ్చేదానికి వీలువుంటుంది మనం బలవంతముగా లాక్కోవటంలేదు అలా లాక్కుంటే కాంపెన్సేషన్ ఇవ్వవలసి వస్తుంది మాకువున్న భూమి ఇదేఅని వారు చెప్పినప్పుడు యింకా వారికి భూమిలేదనే పరిగణించాలి అట్లావుందని ప్రభుత్వానికి తెలుస్తే 'దానంగా' ప్రభుత్వం స్వీకరించాలి

"of his own free volition with no claim for compensation" అని నా సవరణలో వుంది

వారికాభయం వుంటేనే సకాలంలో సరైన లెక్కలు ఇవ్వటానికి ముందుకు వస్తారుకాని ఊరికే లెక్కలు ఇవ్వండి అంటే దానివల్ల ప్రయోజనం ఏమీ వుండదు

అయితే, డిక్లరేషన్ యిచ్చినప్పటికీ, "యిదంతా నాభూమి" అని చూపుతూవుంటే అప్పుడు యింకోసమస్య వస్తుంది ఇంకా దానిని clarify చేయడానికి అతనికి legal rights వుండి, ఆ భూమిని చూపించకపోతే వదులుకొంటారు కాని legal right లేని భూములను తీసుకుంటే అది పేచీ వ్యవహారమే అవుతుంది. అతనికి legal right ఉందా, లేదా అనే సమస్య వస్తై, అతడు కోర్టుకువెళ్ళి ఋజువుచేసుకోవలసి వుంటుంది అనే ఉద్దేశంతో explanation కూడ చేర్చారు నిజంగా భూ సంబంధమయిన లెక్కలు ఖచ్చితంగా ఉన్నవి ఉన్నట్లుగా ప్రభుత్వానికి కావాలంటే తప్పనిసరిగా యిది ఒకటే మార్గం అందు చేత దీనిని అంగీకరించవచ్చు, అంగీకరించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను. Family holdings గురించి నేను ఇచ్చిన సవరణ అంగీకరించినట్లయితే ఎంతో బాగుంటేది. కాని యీనాడు ప్రభుత్వం చేసే లెక్కల సేకరణకు ఉద్దేశ్యం

లేకుండా పోతుంది మంత్రిగారు అన్నింటికీ లేదు, లేదన్నట్లే దీనికికూడా లేదు అంటారు అనుకోండి. Ordinance కావాలనుకున్నాము అదంతా అయిపోతోంది, ఏదో అనుకున్నాము, అయిపోయింది, మళ్ళీ దీనికంతా ప్రాణం పోయడం ఎందుకు వచ్చినదని" అని మంత్రిగారు యిదివరకే అంటున్నారు కాని అసలు దృక్పథం చెప్పడానికి, యికముందయినా యిటువంటి బిల్లులు తేవడానికి ఉపయోగకరంగా వుంటుంది ప్రభుత్వ దృష్టికి తేవడం మంచిది రికార్డులలో ఉంటాయనే దృష్టితో మేము యిటువంటి సవరణలను ప్రతిపాదిస్తున్నాము

మిస్టర్ స్పీకర్ ఒకరి ఆస్తి State కు చెందాలి Registration, document, stamp యివన్ని లేకుండా అతను దస్తావేజులో చెప్పలేదు, affidavit లో చెప్పలేదు, declaration లో చెప్పలేదు, కాబట్టి అతను యావత్తుభూమిలో వుండే హక్కులన్నీ పోతాయనేటటువంటిది constitution position ప్రకారం సరయినదా అని సందేహంగా ఉన్నది

*Sri K. Venkata Rao* : I think it offeds article 31 of the constitution

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : దీంట్లో భూమికి సంబంధించిన సరైన లెక్క ఇవ్వకపోతే, సమాధానంయివ్వకపోతే పెనాలిటీ వేస్తున్నామని చెప్పారు అంతే కాని, reason, rhyme లేకుండా, చట్టం లేకుండా చేస్తున్నటువంటిది ఏమీలేదు. Penality provision ను బట్టి యిదివరకు 500 రు॥ లు జరిమానా ఏ విధంగా విధిస్తున్నామో, అదేవిధంగా ఆ 500 అనేది తీసేసి, యిన్ని ఎకరాలు పెనాలిటీ వేస్తున్నాము అంటే అది constitution కు భంగం కలిగించదని నా ఉద్దేశం.

శ్రీ యల్. లక్ష్మణదాస్ . అధ్యక్షా, సుందరయ్యగారి సవరణ constitutional గా యిక్కడ చెల్లదు, అంతేకాకుండా, అసలు amendment తీసుకు రావడంలోగల ఉద్దేశంకూడా నాకు అర్థం కావడంలేదు. అది సుందరయ్యగారి ప్రభుత్వంలో జరిగే విషయమేగాని, Democracy లో, కోర్టులు వుండి, హక్కులు వుండి వీటన్నింటినీ పాటించే పరిస్థితులున్నప్పుడు ఒకవేళ నా యీ సవరణను ఆమోదించినప్పటికీ, దానిని ఆచరణలో పెట్టే యోగ్యతమాత్రం యీ ప్రజాస్వామిక ప్రభుత్వంలో ఉండదు. ఎక్కడో ఆస్తులు తీసుకోవడం, confiscate చేయడం ఆశేషింపయాలు ఏదో ఒక particular Government లో dictatorship [illegible] ప్రభుత్వంలో జరగాలి తప్ప, యిక్కడ జరగవు. ఇప్పుడు ఎవరికి ఎంత

ఆస్తి ఉన్నది. 20 ఎకరాలకంటె హెచ్చు ఆస్తి గలవారు ఎంతమంది ఉన్నారు, అనే లెక్కలు కావాలని మనం కోరుతున్నాము ప్రభుత్వ మెషినరీలో సరిగా లెక్కలు రాకపోవడంచేత, వారే declare చేయాలంటున్నాము, బాగానే ఉన్నది అట్లా లెక్కలివ్వడంలో ఏమైనా పొరపాట్లు జరినగినప్పుడు వారికి జరిమానాలు వేయడంగాని, శిక్షించడంగాని చాలా తప్పు అని చాలామంది సభ్యులు తెలియజేశారు దీనికి జరిమానా 500 రు॥ లు అన్నారు "ఇదే ఎక్కువ దానిని యింకా తగ్గించాల"ని వారందరూ చెబుతారని నేనుభావించాను కాని ఏ పొరపాటువల్లనైనా ఆ లెక్కలు తప్పుగావుంటే లెక్కలోనికిరాని ఆస్తి అంతా ప్రభుత్వానికే చెందాలని వారు చెప్పారు మన పద్ధతి ప్రకారం తండ్రి ఏ పిచ్చి ఎత్తిన కారణం చేతనైనా తన ఆస్థిని తక్కువ ధరకు అమ్ముకుంటే మళ్ళీ ఆ ఆస్థి కొడుకుకు వచ్చే హక్కులు ఉంటూవుండగా, ఏదో పొరపాటున పొరపాటు లెక్కలు యిచ్చాడనీ, తనకువున్న 20 ఎకరాల భూమిని లెక్కలో చెప్పనంత మాత్రాన, ఆ ఆస్థిఅంతా తీసుకోడమే కాకుండా compensation లేదు. అని చెప్పడంవల్ల యీ amendment చెల్లదని నేను మనవి చేస్తున్నాను

*Sri T Veera Raghavulu (Kovvur Reserved)* On a point of information Sir, లెక్కలు యివ్వడంలో తనభూమి కొంత దాచినట్లయితే ఆ భూమికిఉండేహక్కు అంతా పోయేటట్లుగా సవరణ తేవాలని సుందరయ్య గారు చెబుతున్నారు నావంటివాడు లేని భూమిని కూడా లెక్కలలో యిస్తే title వస్తుందా ?

శ్రీ జి యల్లమందారెడ్డి. అధ్యక్షా, లక్షణదాసుగారు మాట్లాడేటప్పుడు దీనికి సంబంధంలేని అప్రస్తుత విషయాలు కొన్ని చెప్పారు

మిస్టర్ స్పీకర్; మీరు law point చెప్పండి ఈసవరణలో compensation లేకుండానే ప్రభుత్వం ఆభూమిని లాక్కుంటుంది అది ప్రభుత్వానికి వచ్చేస్తుంది దస్తావేజు లేకుండానే, Declaration చేయడంలో, affidavit యివ్వడంలో దొంగతనమే చేశాడనుకోండి ఆ వెంటనే భూమి యావత్తూ ప్రభుత్వానికి చెందుతుంది; compensation యివ్వనక్కరలేదు Stamp, registration లేదు. తరువాత ఇది Article 31 of the constitution కు వ్యతిరేకమా అనే అనుమానం ఉన్నది అంతేకాని వారు irrelevent ఏంచెప్పారు ? Constitutional గా Article 31 కు యిది వ్యతిరేకమా, కాదా అనేది సుందరయ్యగారు సెలవిచ్చినట్లయితే వింటామని ఉన్నది. Registration Act కు, Stamp Act కు కూడా వ్యతిరేకమే. ఇన్ని Acts కు వ్యతిరేకమైనది చేయవచ్చునా ?

"No such law as is referred to in clause (2) made by the Legislature of a State shall have effect unless such law, having been reserved for the consideration of the President, has received his assent"

అనేటటువంటి complications అన్నీ ఉన్నాయి ఈ amendment గురించి legal point సుందరయ్యగారిని చెప్పమంటున్నాను, యల్లమందా రెడ్డి గారిని మాట్లాడనివ్వదలచుకోలేదు Law అంటే అంతా మాట్లాడతారు నేను అదంతా ఒప్పుకోను

I shall use my discretion I will only ask the Leader of the opposition on the point, and not others

సుందరయ్యగారు, మంత్రిగారు చెప్పిన తరువాత యీ amendment విషయమై నా ruling యిస్తాను

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం) . అధ్యక్షా, ప్రతిపక్షనాయకులు constitution provision చదువుతున్నారు ఈలోగా నేను రెండు వాక్యాలు చెబుతాను

మిస్టర్ స్పీకర్ · Law ను గురించేనా ?

శ్రీ బి శ్రీరామమూర్తి కాను.

మిస్టర్ స్పీకర్ Article 31లో ఏమి వుందో చెప్పండి ముందుగా

శ్రీ బి శ్రీరామమూర్తి నేను మీ గదిలో కూర్చుంటాను కావాలంటే అప్పుడు పరీక్షచేయండి. ఇప్పుడు నేను చెప్పే విషయాలను దయచేసి వినండి దానికి సంబంధించిన మేరకే కొన్ని విషయాలు మనవిచేస్తాను

ఒక వ్యక్తికి తనది అనుకొనే ఆస్థి ఉన్నట్లయితే, compensation యివ్వకుండా ప్రభుత్వం సేకరించడం చట్టానికి వ్యతిరేకమే అవుతుంది కాని కొంత భూమిని తానే గుర్తించకుండా వున్నట్లయితే, దానిని ప్రభుత్వం తీసుకోవడం విషయంలో compensation అనే ప్రశ్న లేదు.

If I try to establish my title on the land, then the question of compensation arises.

*Mr Speaker* Then, to whom should it go ?

శ్రీ బి శ్రీరామమూర్తి అధ్యక్షా, unclaimed property క్రింద వుండి పోయిన ప్రతిఒక్కటీ కూడా ప్రభుత్వానికే సంక్రమిస్తుంది అనే విషయం కూడా మనం పాటించవలసివుంటుంది ఆస్థి వుంది. దానిని 'నాది' అని ఎవరూ claim చేయలేదు కదా ! Title establish చేయాలంటే అక్కడ ఒక claim కూడా ఉండాలి Claim లేనట్లయితే ప్రభుత్వానికే చెందుతుంది

మిస్టర్ స్పీకర్ ప్రభుత్వానికి చెందుతుందా ?

శ్రీ బి. శ్రీరామమూర్తి తప్పకుండా చెందుతుంది

మిస్టర్ స్పీకర్ వారసులు లేకుండా చచ్చిపోతే escheat అని ఉన్నది. లేకపోతే అది చెల్లదు Escheat అని వుంటేనే ప్రయివేటు ప్రాపరిటీ ప్రభుత్వానికి చెందుతుంది, లేకపోతే చెందదు. వారసుడు చచ్చిపోతాడు వారసు లెవ్వరూ లేకపోతే ప్రభుత్వానికి చెందుతుంది కాని, వారసులు చాలా మంది వుంటే అది ప్రభుత్వానికి చెందుతుంది అనే law తప్పు కాదా ?

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు Unclaimed property ఏమౌతుంది ?

మిస్టర్ స్పీకర్ Unclaimed property అయినా, వారి వారసులకు చెందుతుంది.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు వారసులు లేకపోతే unclaimed property ఏమవుతుంది ?

మిస్టర్ స్పీకర్ అతనికున్న మైనర్ కొడుకులను, భార్యను, బంధువులను ఎట్లా తీసేస్తారు ? అదెట్లా జరుగుతుంది ? అతడు నాది కాదు అంటాడు అందుచేత అది అతని కొడుకు తీసుకుంటాడు. అందుచేత escheat అయితే తప్ప ఇంక దేనికిందా ప్రభుత్వానికి రాదు

శ్రీ పి. సుందరయ్య అధ్యక్షా, constitution ప్రకారం ఈ సవరణ చాలా సక్రమమైనదని మనవిచేస్తున్నాను. Constitution లోని Article చదివి వినిపిస్తాను.

Article 31 of the Constitution of India says like this —

"(1) No person shall be deprived of his property save by authority of law

(2) No property shall be compulsorily acquired or requisitioned save for a public purpose and save by authority of a law which provides for compensation for the property so acquired or requisitioned and either fixes the amount of the compensation or specifies the principles on which, and the manner in which, the compensation is to be determined and given, and no such law shall be called in question in any court on the ground that the compensation provided by that law is not adequate."

ఇక్కడ మనం compulsury గా acqure చేయడంలేదు Requisition కూడా చేసి తీసుకోడంలేదు అందుచేత compensation అనేది ఎందుకు ఇవ్వవలసివస్తుంది ? ఎవ్వరైనా gift గా కాని, Voluntary గా freewill తో నేను state కి surrender చేయాలనే దృష్టితో భూమిని యిస్తున్నపుడు, అలాంటి దానికి compensation యివ్వాలని constitution లో ఎక్కడాలేదు Constitution లో public purpose కొరకు ఒక law చేసి దేనినైనా acqure, చేసినపుడు, compulsory acquisition, లేకుంటే requisition చేసినపుడే compensation యివ్వవలసి వస్తుంది కాని మిగిలినపుడు Compensation యివ్వనవసరంలేదు. మనం ఈనాడు "నీ ఆస్తి ఎంత ?" అని అతనిని అడుగుతున్నాం అతడు 'నా ఆస్తి యింత' అని చెప్తున్నాడు ఆ విధంగా చెప్పినపుడు దానిని నమ్ముతున్నాము We take him at his word. అది అతనిది కాదు అనేటటువంటి సమస్య ఏదైనా వచ్చినపుడు, 'నిజమే అతనిది కాదు' అని అంటున్నాము అతని వారసుడు కాని, ఇంకెవరైనా అతని బంధువు కాని, claim చేయకుండా ఉన్నపుడు, ఇంకొకరెవరైనా 'అది అతనిది కాదు, నాది' అని claim చేస్తే అపుడది వేరే ప్రశ్న. ఎవరూ claim చేయకుండా అతనికి వారసుడు లేకుండా ఉన్నా, తన ఆస్తికూడా చెప్పకుండా ఉన్నపుడు దానిని మనము prima facie case గా తీసుకొనవలసి యున్నది. అతడు ఈ పన్నులభారం వహించలేక, ఈ గరిష్ఠ భూ పరిమితి బాధపడలేక ప్రభుత్వానికి దానం చేశాడు అని మనం అర్థం చేసుకోవాలి. ఆ రకంగా చేసినపుడు అది compulsory acquisition కాదు. అందుచేత దానికి Compensation యివ్వవలసిన అవసరంలేదు ఇది స్పష్టంగానే ఉంది. అధ్యక్షా ! ఇంతేకాకుండా నేను, 31 clause (5) లో 'shall affect' అనే దానిక్రింద ఇంకొక విషయం తమదృష్టికి తీసుకువస్తున్నాను.

"31 (5)—Nothing in clause (2) shall affect—

(a) the provisions of any existing law other than a law to which the provisions of clause (6) apply, or

(b) the provisions of any law which the State may hereafter make—

(i) for the purpose of imposing or levying any tax or penalty, or

(ii) for the promotion of public health or the prevention of danger to life or property, or

(iii) in pursuance of any agreement entered into between the Government of the Dominion of India or the Government of India and the Government of any other country, or otherwise, with respect to property declared by law to be evacuee property "

అది penalty క్రిందకు వచ్చేటట్లయితే దానికి compensation యివ్వవలసిన అనసరంలేదు దానిని బలవంతంగా తీసుకోవడంలేదు స్వేచ్ఛగా యివ్వవచ్చు అని ఒకప్రక్కన అంటున్నాము. అంటే అదిఒకవిధమైన compensation "నీవు ఉన్నది ఖచ్చితంగా చెప్పడం లేదు, కనుక ప్రభుత్వానికి దానం చేసినట్లనుకుంటున్నాము" అని మనం sufficient notice యిచ్చినపుడు property యొక్క right ను infringe చేసినట్లుకాదు అందుచేత దానికి compensation యివ్వవలసిన అవసరం లేదు. అందుచేత మనంకూడా దానిపై law చేస్తున్నాము అందుచేత constitution లోని Article 31 (5) దీనికి వ్యతిరేకంకాదు. దీనికి President యొక్క అనుమతి ఉండవలసిన అవసరంకూడా లేదు దీనికి stamp duty, registration fees అవసరం ఉండదు అతడు automatic గా భూమిని ప్రభుత్వానికి దానం చేస్తానని అంటున్నప్పుడు, ప్రభుత్వానికి భూమి వస్తున్నప్పుడు "నీవు stamp duty చెల్లించి, registration చేసి, ప్రభుత్వానికి దానం చెయ్యి" అని మనం అనడం ఎందుకు ? Stamp duty చెల్లించ నవసరం లేదు, registration చేయనవసరం లేదు, అది exempt చేయవచ్చును. ఇందువల్ల ఈ విషయమై ఏమీ difficulty లేదు. అందుచేత constitution ప్రకారం చూస్తే ఇలాంటి సవరణ పెట్టటం సరైనదే. కాబట్టి ఇది out of order కాదని నేను విన్నవిస్తున్నాను.

*Sri K. Venkata Rao*. Constitution says:

"No person shall be deprived of his property save by authority of law." Is this the competent law? Does the law passed by a State Assembly asking for the declaration of certain of their agri-

cultural lands give us the right to deprive 'X' of his property, simply because he did not make a declaration? Can that be constitutional? It really amounts to deprivation of the property Sir, that is the objection

*Mr Speaker* So, under Article 31 of the Constitution, I rule the amendment out of order

ఇది constitution లోని Article 31 (1) కి వ్యతిరేకం Deprivation of the property, దీనిని ఈ విధంగా చేయకూడదు ఇది వేరే. దీనికి compensation యివ్వాలి. ఊరికే "మీరు నాది అని చెప్పలేదు కనుక మీ property పోయింది" అని అతడేదో సాక్ష్యం యిస్తూ "అది నాది కాదని" అనగానే అతని property పోదు అలాంటి తప్పుడు సాక్ష్యం చెప్తే శిక్షిస్తారు కూడాను Penalty అంటే property లాక్కోవడంలేదు పన్నులు కట్టకపోతే వేసే fines మొదలైనటువంటివి penalty క్రిందకు వస్తాయి

శ్రీ పి. వెంకటేశ్వర్లు Volutary surrender క్రిందకువస్తే ఎట్లాగండి ?

మిస్టర్ స్పీకర్ · మీరు లాక్కుపోతుంటే Voluntary surrender ఎలాగవుతుంది ? Voluntary surrender అని మీరు ఎంచుకుంటే అదితప్పు అందుచేత Constitution లోని Article 31 కు ఇది వ్యతిరేకం కనుక I rule the amendment out of order (ఈ సవరణ సక్రమంగా లేదని త్రోసివేస్తున్నాను )

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, బి. శ్రీరామమూర్తిగారువరుసగా amendments యిచ్చారు ఈ మూడూ ఒకటిగానే, ఒకవిషయంగురించే యివ్వబడ్డాయి. అందుచేత వీటిలో ఏదిబాగుంటుందో చూపేదానికే ఈ ముగ్గురూ కలిసి ప్రతిపాదించినట్లు—

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు . మా amendments లో కొంత . భేదం ఉందని చెప్తున్నాను. బినామి transfers అన్నీ చెల్లకూడదని మా సవరణలు ఉన్నాయి, వారిచ్చిన సవరణలో మిగిలిన transfers అన్నికూడ చెల్లవు అని ఉన్నది.

మిస్టర్ స్పీకర్ : "మిగిలిన" అనికాదు. మీరు ఒక Benami transfers మాత్రమే చెల్లకూడదంటున్నారు, వారు Benami transfers తో సహా అన్ని

transfers కూడా చెల్లకూడదంటున్నారు, అందుచేత మీరు తెచ్చిన Benami transfers చెల్లకూడదనే సవరణకూడా వారి సవరణలో యిమిడిఉంది అందు వల్ల వాళ్ళ సవరణ బాగుంది

శ్రీ పి వెంకటేశ్వర్లు, నేను ఒక బినామి ట్రాన్సుఫర్ మాత్రమే చెల్లకూడ దంటున్నాను మిగిలిన transfers విషయంలో నేను వారిచ్చినదానిని అంగీ కరింపలేకపోవచ్చు

మిస్టర్ స్పీకర్ మీరు అంగీకరించకపోతే మా కేమి ? అన్నీ చెల్లవన్న పుడు మీదికూడా అందులో include అయిపోయింది

శ్రీ పి. వెంకటేశ్వర్లు అందువల్ల ఒక బినామీ ట్రాన్సుఫర్‌కు మాత్రమే సంబంధించిన మా సవరణను ముందు ఓటింగ్‌కు పెట్టాలి మీరు రెండింటిమధ్య distinction చూడండి మాసవరణ ఒక బినామీ transfer మాత్రమేచెల్లదనిన్నీ, వారిదేమో మిగిలిన transfers

మిస్టర్ స్పీకర్, 'మిగిలిన' అనే మాట అనకండి అన్నీ చెల్లవు అని వారిచ్చిన సవరణలో ఉంది

శ్రీ బి. శ్రీరామమూర్తి అసలు మా amendments యివ్వడంలోగల purpose ను తెలియ చేయడానికి అవకాశం యివ్వవలసినదని మనవి చేస్తు న్నాను ఎందులో హెచ్చు వివరాలున్నాయనేటటువంటి విషయం ప్రస్తుతం మన ఎదుటలేదు ఎందుకంటె మేము ఇచ్చిన దాంట్లో ప్రత్యేకించి ఫలానా తేదీ అనంతరం జరిగినటువంటి transactions కు ఇది వర్తిస్తుందని స్పష్టంగా ఉంది పోతే పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, యల్లమందా రెడ్డిగారు ఇచ్చినటువంటి amendments లో ఎప్పటినుంచి జరిగిన benami transactions అనేటటువంటివి ఏమీలేదు. అందుచేత బహుశః ఇది స్పష్టంగా ఉందేమోనని నేను అనుకుంటున్నాను అందుచేత ఈ రకంగా తీసుకొంటేనే బాగుంటుంది.

శ్రీ కె. వెంకటరావు : ఒకర్ని move చేయమని మిగతా ఇద్దర్నీ మాట్లాడమనండి.

మిస్టర్ స్పీకర్ స్పీకర్ యొక్క rights ను surrender చేయడంలేదు Amendments అన్నీ వచ్చినతరువాత, అన్నిటిలోను ఏది విస్తృతంగా ఉన్నదో

decide చేసి దానిని స్పీకర్ గారు admit చేయాలి ఈవిధంగా rules లో ఉన్నది కనుక ఇపుడు శ్రీరామమూర్తిగారిచ్చిన సవరణ విస్తృతంగా ఉంది మిగతా సవరణలన్నీ దానితోకలసి వస్తాయని నేను అంటున్నాను

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు On a point of order, Sir ! మా సవరణ purpose వేరు, శ్రీరామమూర్తి గారిచ్చిన సవరణ purpose వేరు, ఈ రెండూ different purposes తో తీసుకురాబడినాయి మేము తీసుకువచ్చిన సవరణ indirect గా శ్రీరామమూర్తిగారు యిచ్చిన సవరణలోనే ఉండవచ్చును కాని ఈ రెంటికీ differnce ఉంది ఈ రెండూ two different amendments with two different purposes, ఈ రెంటి ప్రాతిపదిక వేరు కనుక ఈ రెండూ వేర్వేరుగానే తీసుకోవాలని నేను మనవి చేస్తున్నాను

*Sri B Sreeramamurti* Mr Speaker, Sir, I beg to move

"Add the following as new clause 4 at the end of the existing clause 3 and renumber the remaining clauses

4 Prohibition of alienations · Any alienation, either by way of division, sales, registrations or any documents, which result in the diminution of holdings effected on or after 21st September, 1957 become null and void"

*Mr Speaker :* Motion moved

శ్రీ బి. శ్రీరామమూర్తి . ఈ సవరణను తీసుకొని రావడములో ఒక ప్రత్యేక ఉద్దేశం ఉన్నది భూకమతాల లెక్కలను సేకరించడానికి ప్రభుత్వం యీ ఆర్డినెన్సును తీసుకొచ్చారు ఇది ఒక ఎక్స్ట్రార్డినరీ మెథడ్ అని నేను భావిస్తున్నాను. ఎవరిదగ్గర ఎమాత్రము భూమి ఉన్నదో తెలుసుకొనుటకు ఒక ఆర్డినెన్సు అవసరములేదు. అడ్మినిస్ట్రేటివ్ మెషినరీ ఉండగా ఒక ఆర్డినెన్సు ద్వారా రైతులే తమతమ భూకమతాల లెక్కలు ఇవ్వాలని చెప్పడం అసాధారణమైన విషయం. ఏమైనప్పటికీ యీ ఆర్డినెన్సువల్ల తగినంత ప్రయోజనం కలుగుతుందని నేను అనుకోవడంలేదు అందుకనే ఈ సవరణను ప్రతిపాదించాను. ప్రభుత్వం యీ ఆర్డినెన్సును జారీచేయగానే ఇది ఏ భూములకు ఇది వర్తిస్తుంది, ఏ భూములకు వర్తించదు అని చాలామంది ఆలోచిస్తూవచ్చారు. ఒకవంక 20 ఎకరాలకు మించిన భూమివసతి గలవారికే ఇది వర్తిస్తుందని చెప్పినప్పటికీ రెండవ ప్రక్కనుంచి కొన్నివందల ఎకరములకు మించిఉన్న భూస్వాములకే ఇది వర్తిస్తుందని బాధ్యతగల మంత్రులుకూడా చెబుతున్నారు.

శాసనసభ బయట మంత్రులు చేసిన ప్రకటనలు శాసనసభలో చర్చకు తీసుకు రావడం సమంజసంకాదని తమరనవచ్చు అయినప్పటికీ "వందల ఎకరాలు ఉన్నవారి భూములను మాత్రమే తీసికొనగలము" అని సంజీవరెడ్డిగారు చేసిన ప్రకటన ఆంధ్రప్రభలో 17-10-1957 తారీఖున ప్రకటింపబడినది ఒక ప్రక్కనుంచి కొన్నివందల ఎకరాలకు మించిఉన్న భూస్వాముల దగ్గరనుంచే భూమిని తీసుకోడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందని ప్రకటిస్తూ రెండవప్రక్కనుంచి 20 ఎకరాలున్న వ్యక్తులు లెక్కలివ్వాలని ఆర్డినెన్సు జారీచేయడంలో ఉన్నటువంటి అర్థమేమిటి? కాబట్టి యీ ఆర్డినెన్సు మనకు వర్తించదు అని ప్రతిఒక్కరూ అన్యాక్రాంతాలు చేయడం మొదలుపెట్టారు అలాంటివి చాలా ఉన్నాయి ఈ ఆర్డినెన్సు జారీచేసిన తర్వాత ఇంతవరకూ జరిగిన రెజిస్ట్రేషన్స్‌ను చూచుకున్నట్లయితే యీ విషయం బోధపడుతుంది. ఈ ఆర్డినెన్సుకు ఒక ప్రయోజనం కలుగజేయవలెనంటే నా సవరణను అంగీకరించవలసి యున్నది ఎంతోకాలముగా ఎలియనేషన్సును నిషేధించాలని చెబుతూ వచ్చాము "మేము retrospective తో చట్టము చేయమని మీరు ఎందుకు భావించాలి, మా తాలూకు అభిప్రాయములు మీకు స్పష్టముగా తెలుసునా? మీరు దీనినిగురించి కంగారుపడనవసరంలేదు" అని ప్రభుత్వంవారు ఇంతకాలముగా సమాధానము చెబుతూ వచ్చారు. కళా వెంకట్రావుగారు యీ ఆర్డినెన్సు విషయంలో ఉపన్యసిస్తూ ఒకచోట చేసిన ఉపన్యాసానికి పేపరువారు ప్రచురించిన పారంలో కొంత చదువుతాను

"Sri Kala Venkata Rao addressing a conference expressed his surprise on the unfounded fears of landholders simply because the Government asked those owning more than 20 acres of land to furnish some particulars"

అందుచేత 20 ఎకరాల పైగా ఉన్నవారు వారి భూ కమతాల వివరాలను ఇవ్వాలని ఆర్డినెన్సు చేసినంత మాత్రమున భూ ఖామందులు భయపడరు వారిని అసంతృప్తి పడవద్దని భయపడవద్దని, చెబుతున్నట్టు కనబడుతున్నది ఒక వంక ఎలియనేషన్సు నిషేధించవలెనని చెబుతున్నవారిని సంతృప్తిపరచడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇంకొకవంక ఎలియనేషన్సు కావాలని చెబుతున్న వారినికూడా సంతృప్తిపరచడానికి ప్రయత్నం చేస్తున్నారు ప్రభుత్వానికి ఒక ఖచ్చితమయిన సిద్ధాంతము పద్ధతి లేదనేదానికి ఇది ఒక ఉదాహరణ ప్రభుత్వము ఎప్పుడూ ఫెన్సుమీద కూర్చుంటుంది. ప్రభుత్వము యీ రకమయినటువంటి ప్రకటనలు చేయడంవల్ల సరిఅయినటువంటి లెక్కలు రావు, అందువల్ల యీ అంకెలను సేకరించడం నిరర్థకం, అనవసరం. ఇటువంటి లెక్కలను సేక

రించుటకు ఆర్డినెన్సు, చట్టాలు తీసుకొని రావడమువలన ప్రయోజనం లేదు ఈ ఆర్డినెన్సు జారీ చేసినతరువాత భూములు ఎన్ని చేతులుమారినా ఆ మార్పిడులను నిరర్థకము చేస్తూ ఒక స్పష్టమైన క్లాజు యీ బిల్లులో ఇన్‌కార్పొరేట్ చేసినట్లయితే యీ ఆర్డినెన్సు జారీచేసిన ప్రయోజనం ఉంటుందని తెలియ చేస్తున్నాను. అందుచేత ఆ విధముగా చేయాలని ప్రభుత్వం వారిని కోరుతున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఈసవరణను బలపరుస్తున్నాను లాండు రిఫారమ్సు చేసే సందర్భములో ఇటువంటి లెక్కలు కావలెనని యీ ఆర్డినెన్సును జారీచేసినట్లు మంత్రిగారు చెబుతున్నారు కాని దీనివల్ల అనుకున్నంతటి ప్రయోజనం కలుగదు ఏరోజున ఆర్డినెన్సు జారీచేశారో ఆ రోజునుంచీ చేతులు మారిన పొలాలు చెల్లవని అంటేనేతప్ప అన్యాక్రాంతాలు జరుగుతూనే యుంటాయి. ఈ బిల్లులో రిజెన్‌డీడ్సు అనికూడా ఉండడమువలన పాత స్టాంపులుమీద పాత తారీఖులు వేసి భూములను అన్యాక్రాంతం చేయడం జరుగుతున్నది స్టాంపుపయిన ఏ తారీకు వేసి ఉంటుందో ఆ తారీఖు తరువాత డాక్యుమెంటు వ్రాసినట్లయితేనే అది చెల్లుతుందని మంత్రిగారు చెప్పారు ఈ విధంగా డాక్యుమెంట్లు వ్రాసేవారు చాలా తెలివిగలవారు వాళ్ళ మాస్టర్ లిటిగెంట్లు ఎక్కడెక్కడ ఉన్న పాతస్టాంపులను వారు సేకరించుతున్నారు. విక్టోరియా రాణి కాలమునాటి స్టాంపులనుకూడా అమ్ముతున్నవారున్నారు ఈనాడు దేశంలో ఆ సెక్షనుకు పంట పండింది

శ్రీ ఎల్. లక్ష్మణదాసు లిటిగెంట్సు, మాస్టర్ లిటిగెంట్సు అని అంటున్నారు శ్రీ గోపాలకృష్ణయ్యగారు వా రెవరో, ఎక్కడున్నారో చెబుతారా

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య . ఆ సెక్షను ఎక్కడ ఉన్నదో విచారణ చేయడానికి గవర్నమెంటువారు యాంటీ కరప్షన్ బ్రాంచినివేసి లక్ష్మణదాసు గారిని కూడా విచారణ చేయమని చెప్పినట్లయితే యీ విషయము బోధపడుతుంది. ఈ విధంగా స్టాంపులు అమ్మేవారు చాలా తెలివిగలవారు. వారు అమ్ముతున్నారు. ఈ నాడు సబ్ రిజిష్ట్రారు కచేరీలకు వెళ్ళి చూచినట్లయితే యీ విధమయిన కేసులున్నాయి. బోధపడుతుంది, తెలంగాణాలో అనుకుంటాను, కలెక్టరు పర్మిషన్ లేనిదే కాగితాలను రిజిష్టరు చేయకూడదని [illegible] ఉన్నట్లున్నది. ఈ మధ్యన సబ్ రిజిష్ట్రారు కచేరీలకు కలెక్టరు [illegible] లేనిదే రిజిష్టరు చేయవద్దని ఒక పర్టిక్యులర్ ఎలా వచ్చినదో నాకు

తెలియదు కాని కొందరు సబ్ రిజిష్ట్రారులు కలెక్టరు పర్మిషను లేనిదే మేము రిజిస్టరు చేయము అని అంటున్నారు ఐతే కొందరు ఆ సర్క్యులరు చూపించవలసిందని గట్టిగా అడుగుతున్నందువల్ల సర్క్యులరు చూపిస్తే చిక్కు వస్తుందేమోనని సర్క్యులర్ మా దగ్గర లేదని చెబుతున్నారు సర్క్యులరు లేదు కనుక రిజిష్టరుచేస్తున్నా రనికూడా చెప్పవలసివస్తున్నది కాబట్టి అటువంటి సర్క్యులర్ ఇచ్చారోలేదో ఈ వేదిక మీదినుండి ప్రకటించారంటే చాలాఉపయోగపడుతుంది ఇటువంటి రిజిస్ట్రేషన్లు ఆగిపోతాయి రెట్రాస్పెక్టివ్ ఎఫెక్టుతో ఫలానా తారీకు తర్వాత జరిగిన రిజిస్ట్రేషన్సు అన్నీ కూడా రద్దు చేస్తామని చెప్పినట్లయితే పాతస్టాంపులమీద రిలెన్‌డీడ్సు వ్రాసి ఇపుడు రిజిస్టరు చేయడం తగ్గిపోతున్నది డాక్యుమెంట్లు వ్రాసినమూడు నెలలవరకూ రిజిస్ట్రేషనుకు టైము ఉంది 3 నెలలకు మించి ఉండినట్లయితే రిజిస్ట్రేషన్ చెల్లదు 3 నెలలకు పూర్వము వ్రాసుకొన్నా వ్రాసియీవాళ రిజిష్టరు చేయమంటే సబ్‌రిజిష్ట్రారు నిరాకరించడానికి వీలులేదు యీ విధముగా మనము టైము ఇస్తున్నందువల్ల ఇక మిగిలే భూమి ఏమీ ఉండదు ల్యాండు రిఫారమ్సు చేసేనాటికి పెద్దలు సామెత చెప్పినట్లుగా పంచపాండవులంటే నే నెరుగనా ? మంచపు కోళ్ళవలె త్రిమూర్తులు యిద్దరు అంటూ ఒక వేలు చూపి సున్నాచుట్టిన పరిస్థితి ఏర్పడుతుంది కాబట్టి ప్రభుత్వంవారు ఈ సవరణను అంగీకరించమని కోరుతున్నాను. భూసంస్కరణలు తప్పకుండా తెచ్చెదమని, సోషలిష్టు సమాజ వ్యవస్థ నెలకొల్పమేమోనని అనుమానం పెట్టుకొనుట సరైనదికాదని వారు చెపుతున్నారు దానికి మేము అభివందనలు అర్పిస్తున్నాము కాని land లేని సోషలిజమును మనము తీసుకువచ్చే పరిస్థితి వస్తోంది Shankar's weekly లో వేసిన బొమ్మను గురించి మొన్న ఎవరో చెప్పినారు కేరళ ప్రభుత్వం, భూమి ఎక్కడ ఉన్నదా అని టార్చిలైటుపెట్టి ఆకాశంలో వెతుకుతున్నదిట ! భూమి లేకుండా వారు భూసంస్కరణలు తెస్తామని అంటున్నారు ! వాళ్ళ పరిస్థితి ఏమోగాని, యిక్కడమాత్రం అది యదార్థం అవుతుంది ! మనం యిదే పద్ధతిలో చట్టం చేస్తే, ఆస్థిఅంతా చేతులుమారి, మనకు భూమి లేకుండా పోయేపరిస్థితి వస్తుంది కాబట్టి అటువంటి transactions నన్నింటిని అరికట్టేందుకు ఈ మాదిరి క్లాజు లేకపోతే నష్టంవస్తుంది ఏదో భూసంస్కరణలు అమలు జరుపవలెననే సంకల్పం ప్రభుత్వమునకు కలిగినదని మేముకూడ అనుకొంటున్నాము కనుక నిజాయితీగా అమలు జరుపుటకు యిది అవసరం కాబట్టి తప్పక అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

శ్రీ రాజా వి వి కృష్ణంరాజు బహద్దూర్ (తుని) అధ్యక్షా రెవిన్యూమంత్రి గారు ప్రవేశపెట్టిన ఆర్డినెన్సుకు శ్రీపిల్లలమర్రి వెంకటేశ్వర్లు, ఎల్లమందారెడ్డి, శ్రీరామమూర్తిగార్లు కొన్ని అమెండ్‌మెంట్సు ప్రతిపాదించినారు వాటికి ఈ ఆర్డినెన్సుకు ఎట్టి సంబంధంలేదని తమ ద్వారా మనవిచేస్తున్నాను ఎందుచేత నంటే మూడు మాసముల గడువుయిచ్చి, 20 ఎకరాలకు మించి ఎవరెవరికి ఎంత భూమిఉన్నదో తెలియపరచవలసినదని ఆర్డినెన్సులో ఉన్నది అట్లా తెలియ పరచకపోతే పెనాల్టీవేస్తామని చెప్పినారు వారి సవరణల ఉద్దేశం ఏమంటే- ఆర్డినెన్సుజారీఅయినతరువాతజరిగిన ట్రాన్సాక్షన్స్‌లో ఉన్న బినామీ ట్రాన్స్‌ఫర్స్ బినామీ సేల్సు, బినామీ పార్టిషన్స్, బినామీ గిఫ్ట్సుఅనిన్నీ, అందుకు యివి చెల్ల కూడదనిన్నీ- అన్నారు. కాని ఈ ఆర్డినెన్సు లెక్కల తణిఖీకోసం తెచ్చారుతప్ప transactions చెల్లుతాయా లేదా, లీగలా, ఇల్లీగలా ?- అనే విషయంకాదు. ఆ పూర్వాపరాలు ఎప్పుడు వస్తాయంటే- భూసంస్కరణలు వచ్చినప్పుడు ఏ తేదీకి అమలుజరగాలి, ఏవి చెల్లకూడదు- ఆ విషయాలన్నీ అప్పుడు సానుకూలంగా చర్చించే అవకాశం ఉన్నది ఇప్పుడు ఈ ఆర్డినెన్సులో అవన్నీ తేవడం సమంజసం కాదని మనవిచేస్తున్నాను ప్రస్తుతం ఉన్న మితాక్షర 'లా' ప్రకారమున్నూ Transfer of Property Act ప్రకారం, తమకున్న ఆస్తిని అమ్ముకొనవచ్చును, దానపట్టా చేయవచ్చును అయితే కొడుకులకు, కూతుళ్లకు, భార్యకు, తమ్మునికి ఆస్తిని వ్రాసియిస్తున్నారు, యీబినామీ ట్రాన్సాక్షన్స్‌చెల్లకూడదనిఅంటున్నారు ఇప్పుడు యీ బిల్లుయొక్క ఉద్దేశం ఏమిటి ? ముందు రాబోయే భూసంస్కర ణల ఉద్దేశం ఏమిటి ? ఎక్కువ extent of land మీద వ్యవసాయంచేస్తే ప్రతి ఎకరానికి పుష్కలమైన పంట పండుతుందా, లేదా అనే భావంమీదనే ఈసమస్య.

మిస్టర్ స్పీకర్ తమరు అడిగేది- కూతురికి ఎందుకు యిచ్చుకోకూడదని యిచ్చినంతమాత్రాన బినామీ అవుతుందా ? అనా ?

శ్రీ రాజా వి. వి కృష్ణంరాజు బహద్దూర్ అది బినామీ కాదనీ, అసలు యీ బిల్లుయొక్క ఉద్దేశమునకూ, వారు తెచ్చిన సవరణలకూ సంబంధంలేదని చెప్తున్నాను. Agrarian Reforms యొక్క fundamental principle ఏమంటే- large holdings మీద సక్రమంగా వ్యవసాయం జరగక పంటపండదని, తద్వారా దేశానికి నష్టం వస్తుందనే కారణం చేత, చిన్న చిన్న parts చేస్తే ఎక్కువ పంట పండిస్తారని ఉద్దేశం. రేపు land reforms రాబోతున్నాయని ఈ బిల్లు ప్రకారం 20 ఎకరాలకు కంటె ఎక్కువ ఉన్నవాడెవడూ అదనంగా కొనుక్కొనడు. కొన్నప్పటికీ భూ సంస్కరణల చట్టం వస్తే అది పోతుంది.

20 ఎకరాలకంటె ఎక్కువభూమి ఉన్నవానికి ఎవరూ భూమిని వ్రాసియివ్వరు కూడా అందువల్ల ఎవరికీ సందిగ్ధాలు, సందేహాలు ఉండనవసరం లేదు అట్టి పరిస్థితులలో వారు తీసుకువచ్చిన సవరణలు చెల్లవు మితాక్షర లా ప్రకారం కూడ చెల్లనేరవు అని తమ ద్వారా మనవిచేస్తూ విరమిస్తున్నాను

శ్రీ టి వి రాఘవులు అధ్యక్షా, ప్రతిపక్షంవారు తెచ్చిన సవరణల గురించి కృష్ణంరాజు బహద్దూర్ గారు చెప్పిన భావములతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను ఈ ఆర్డినెన్సు యొక్క ఉద్దేశం కేవలం అంకెలను సేకరించుటమే భూమికి గరిష్ఠ, కనిష్ఠ ప్రమాణములు నిర్ణయించుటకు ఈ అంకెలు తోడ్పడతా యని భావించారు అంకెలు యివ్వమని అడిగినంత మాత్రాన తన ఆస్తియందు ఉన్న హక్కును ఉపయోగించుకోనకూడదు, అమ్ముకోనకూడదు- అనే భావం ఏ శాసనములోనూ లేదు ఇందులో, ఆర్డినెన్సు వచ్చిన రోజుకు ఎంత భూమి ఉన్నదో చెప్పమన్నారు. ఆ లెక్కలు చెప్పటానికి టైముయిచ్చారు. ఆర్డినెన్సు వచ్చిన రోజుకు ఎంతభూమి ఉన్నదో చెప్పమంటే అది ఎట్లా avoid చేయగలరు ? తరువాత బినామీ ట్రాన్‌శాక్షన్సు జరుగుతున్నాయంటున్నారు వాటిని గురించి భయపడవలసిన పనిలేదు నిజంగా యితరులకు భూమిని ఊరికే అన్యాక్రాంతం చేస్తే మనం సంతోషించాలి రేపు భూసంస్కరణలు రాబోయే సందర్భంలో బాగా ఆస్తికలవానికి ఎవరూ భూమిని వ్రాసియివ్వరు Partition deeds గురించి భయాన్ని వెలిబుచ్చారు. ఆ భయానికి కూడ ఆస్కారంలేదు రాబోయే భూసంస్కరణలను తప్పించుకొనేందుకు ఈ అన్యాక్రాంతాలు ఏవిధంగానూ పని చేయవని, ఈ ఆర్డినెన్సు సక్రమంగా ఉన్నదని, యిటువంటి amendments అవసరంలేదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

*Sri G Yellamanda Reddi* I beg to move

"Add the following at the end of sub-clause (1) of clause 3—

"and further, all benami transfers, benami sales, benami partitions, benami gifts made by a land-holder of a holding, the total extent of which exceeds twenty acres of lands on the date of commencement of the Ordinance, made for the purpose of evading land reforms, are illegal and void "

*Mr Speaker* Amendment moved

శ్రీ జి. యలమందారెడ్డి - అధ్యక్షా, మా సవరణలు బినామి ట్రాన్‌శాక్షన్సు గురించి పెట్టినాము. గౌరవ సభ్యులు రాఘవులుగారు చెపుతూ యా

బిల్లు కేవలం అంకెలకోసం ఉద్దేశించబడినదని అన్నారు కాని బిల్లుయొక్క objects & reasons లో ఈ అంకెలు భూసంస్కరణలు తెచ్చేందుకు ఉపయోగపడతాయన్నారు ఎప్పటికైనా భూసంస్కరణలు తెచ్చే ఉద్దేశం ఉన్నది కనుక ఈ బినామి ట్రాన్‌శాక్షన్సు జరగకుండావుండాలని చెపుతున్నాము

మిస్టర్ స్పీకర్ గౌరవ సభ్యులకు సహాయంగా ఉండుటకు ఒక మాట చెప్పదలచుకొన్నాను బినామికి అర్థంఏమంటే తనే అనుభవించదలచి ఆస్థిని యింకొకరిపేర పెట్టడం అప్పులవాళ్ళు ఆస్థిని వేసుకుపోతారని యింకొకరి పేర, ఏకూతురిపేరనో పెట్టి, తను అనుభవిస్తాడు అటువంటిది బినామీ అవుతుందికాని కూతురికి చెందాలని యిచ్చినా, కొడుకునకు చెందాలని యిచ్చినా, అల్లునికి చెందాలని యిచ్చినా, అది బినామీక్రిందకు రాదు

శ్రీ జీ యలమందారెడ్డి మీరు చెప్పినది చాలా సరిగా ఉన్నదని నా అభిప్రాయం భూస్వాములు కూతుళ్ళకు గాని యితరులకు గాని చచ్చినా దానం చేయరు తాము అనుభవించాలని, చట్టాన్ని మోసం చేయుటకు, కూతుళ్ళకు యిచ్చినట్లు, అల్లుడికి దానం చేసినట్లు, దారినపోయేవానికి యిచ్చినట్లు వ్రాసి, వారిజుట్టు తమచేతిలో పెట్టుకొని తామే ఆ ఆస్తిని అనుభవిస్తూ ఉంటారు అటువంటి బినామీ ట్రాన్‌శాక్షన్సు గురించే యిప్పుడు మేము చెప్పేది, రిజిస్ట్రేషన్ గురించి ఒక విషయం మనవిచేయవలసి యున్నది ఇదివరకు ఎప్పుడో వ్రాసుకొని ఈనాడు రిజిస్ట్రేషన్ చేసుకుంటున్నట్లు రిజిస్ట్రేషన్ యాక్టును ఉపయోగించుకొని, ప్రభుత్వం బిల్లుయొక్క ఉద్దేశం చెడగొట్టుటకు బినామీలు సృష్టించటం జరుగుతున్నది. వీటిని అరికట్టకపోతే land reforms కు ఉపయోగపడవలసిన ఈ బిల్లుయొక్క ఉద్దేశం నెరవేరదు భూసంస్కరణలకు రాష్ట్రంలో ఉండే భూములలెఖలు కావాలనే ఉద్దేశంతో ఈ బిల్లును తెచ్చారు. ఆ ఉద్దేశం లేకపోతే ఈ ఆర్డినెన్సే అవసరంలేదు అందువలన యీ బినామీ ట్రాన్సాక్షన్సు ఏమీ జరగకూడదు. లేకపోతే, ఆ ఉద్దేశం లేకుండా యీ బిల్లు తెస్తున్నారనంటే రెండు విషయాలు ప్రభుత్వం ఉద్దేశిస్తున్నదని భావిస్తున్నాము. ఇప్పుడు కృష్ణరాజు బహద్దూర్ గారు వివరంగా చెప్పారు. ప్రభుత్వానికి ఇహం, పరం, రెండూ కావాలని కోరుతున్నారు. దేశంలో భూసంస్కరణలు కావాలని బ్రహ్మాండమైన ఆందోళన జరుగుతున్నది కాబట్టి అది వద్దనిచెప్పుట ఎవరికీ సాధ్యంకాదు. వీటికి ఎదురీదుట అసంభవం.

నెల్లూరు జిల్లాలో భూస్వాముల మహాసభ జరిగింది భూ సంస్కరణలు పనికిరావని వారు తీర్మానం చేశారు వారు మంత్రిగారిదగ్గరకు రాయబారం వచ్చారు కొంతమంది వారికి సలహా ఇచ్చారు "మీకు ఏమైనా తిక్క పుట్టిందా? ఇప్పుడు భూ సంస్కరణలు వద్దు అంటే ఎవరు ఒప్పుకొనేవారు లేరు వద్దని చెప్పటానికి ఎవరికి సాహసం లేదు మీ కెందుకు దిగులు? మీకు సెంటు భూమికూడ పోదు భూ సంస్కరణలు అమలు జరుగుతాయి కాని, ఇటువంటి మహాసభలు చేసి, తెలివితక్కువ పని చేయకండి" అని కొందరు వారికి సలహా ఇచ్చారు

మిస్టర్ స్పీకర్ ఆవిధంగా సలహా ఇచ్చింది ఎవరు ?

శ్రీ జి యలమందారెడ్డి గౌరవనీయులైన శాసనసభ్యులే, పేరుమాత్రం అవసరంలేదు

శ్రీ ఎల్ లక్ష్మణదాసు అధ్యక్షా, సభ్యులు ఎలిగేషన్స్ చేస్తూ, పేరు చెప్పకూడదంటే ఎట్లా ? ఆవిధంగా పేరు చెప్పకపోతే చాలామంది ఎలిగేషన్ చేయవచ్చును కాబట్టి సభ్యులు పేరు చెప్పవలసిందిగా కోరుతున్నాను

శ్రీ జి. యలమందారెడ్డి ఇప్పుడు మన ఎదుట శ్రీ కృష్ణంరాజబహద్దూర్ గారే మాట్లాడారు, నేను ఇప్పుడు చెబుతున్నది ఎలిగేషన్ కాదు వారే చెప్పారు "మీ కేమి భూమి వస్తుందయ్యా? మేము తలొక పది ఎకరాలు చొప్పున పంచుకొంటే, మీకు వచ్చిన ఇబ్బంది ఏమిటి?" అని / కాబట్టి నేను చెప్పేది ఎలిగేషన్ కాదు, అది అసలు వారి పాలసీ It is their creed and policy కాబట్టి, భూ సంస్కరణలు తీసుకువచ్చి, ఏ గ్రామంలో, ఏ భూస్వామి దగ్గర ఎంత భూమి తీసుకొని ఎంతమంది పేదలకు ఇచ్చారనే లెక్కలు రేపు చట్టం పాస్ చేసినతరువాత తెలతాయి. ఇంత భూమి తీసుకొని, పేదలకు పంచాము. అని తెలిపితేనే, భూ సంస్కరణలు చేసినట్లు అవుతుంది అట్లుగాక, కేవలం "చట్టంకోసమే చట్టం" పెట్టి. దేశంలో భూమిలేదని చెప్పినంత మాత్రాన లాభంలేదు దేశంలోని సాంఘిక న్యాయంకోసం ఎక్కువ ఉన్న భూమిని, వ్యవసాయకూలీలకు, పేదరైతులకు, భూమిలేని పేద ప్రజానీకానికి పంచటమే భూ సంస్కరణ ఉద్దేశ్యమని, ఆల్ ఇండియా కాంగ్రెసు ఎకనమిక్ రెవ్యూలో కూడ వ్రాయబడింది చట్టంకోసం చట్టం చేయటంకాదు, తప్పని సరిగ పేదప్రజానీకానికి భూమిపంచటమే భూ సంస్కరణల ఉద్దేశ్యమని నేషనల్

డెవలప్ మెంట్ కౌన్సిల్ లోకూడ స్ట్రెస్ చేయబడింది అదేవిధంగా పత్రికలలో కూడ వ్రాయబడింది. కాబట్టి యీ రోజున మనం చేయబోయే చట్టం బినామి ట్రాన్స్‌ఫర్స్‌ను, అక్రమ విభజనలను అరికట్టేదిగా ఉండాలి అందుకు వీలుగా, నా సవరణ ఉన్నది దానిని అంగీకరించవలసిందిగా కోరుతున్నాను

శ్రీ రాజా వి వి కృష్ణంరాజ బహద్దూర్ అధ్యక్షా, పాయింట్ ఆఫ్ ఆర్డర్ సర్, సభ్యులు లాండ్ రిఫారమ్స్ తీసుకురావటం భూమి పంచటంకోసమని చెబుతున్నారు అది ఎంతమాత్రం సరైన విషయంకాదు ఫుడ్ ప్రాబ్లెమ్ సాల్వ్ చేయటము కొరకే లాండ్‌రిఫారమ్స్ తెస్తున్నారుగాని, భూమి పంచటంకోసం కాదని మనవి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ అది పాయింట్ ఆఫ్ ఆర్డర్ కాదు ఎవరి అభిప్రాయం వారు చెబుతున్నారు.

శ్రీ బసవమానయ్య (అంధోలు) అధ్యక్షా, ఈ భూ సంస్కరణలగురించి ఎవరికి ఏవిధమయిన అభిప్రాయభేదం లేదు. మన ప్రభుత్వ అధికారులు, కేంద్ర ప్రభుత్వ అధికారులు, పత్రికలు, విధానసభల సభ్యులు, ప్రజలు అందరూకూడ భూ సంస్కరణలు అవసరమని చెబుతున్నారు. కేంద్రప్రభుత్వము యొక్క అధికారుల వత్తిడివల్లనే యీ కొంచెమయినా సంచలనము కలుగుతున్నది 20 ఎకరాలకంటె ఎక్కువభూమి ఉన్నవారియొక్క అంకెల సేకరణ గురించి శాసనము చేయటానికి తీసుకువచ్చినబిల్లు ఇది "పట్వారీలు సరిగా యీ లెక్కలు తెలుపకపోవచ్చును కనుక భూఖామందుల లెఖలు తెలపాలని" చెప్పారు తెలంగాణాలో యీ విషయాలు పట్వారీలు సేకరిస్తారు అవన్నీ లాండు హోల్డింగ్‌లో వ్రాయబడ్డవి అట్లావ్రాసినప్పటికీ, అనేకమంది భూములు అమ్ముకోవటం జరుగుతున్నది 20 సంవత్సరములనాటి తారీఖువేసి, కాగితాలు వ్రాసుకొంటున్నారు ఎవరిదగ్గర ఎంతభూమి ఉందో తెలుసుకోటానికి, యీ బిల్లు మన ఆంధ్రప్రదేశ్ అంతటికి ఉండడం చాలా అవసరము ఎంతోమంది నిజాంసాగర్ అంథోల్ తాలూకాలకు వచ్చి నూర్ల ఎకరాలు కొని, సేద్యం చేస్తున్నారు. ఈబిల్లు ఒక్క ఆంధ్రప్రాంతానికే వర్తింపజేస్తే, తెలంగాణా ప్రాంతములో కొన్ని భూములు లెఖలోకి రావు. కాబట్టి మొత్తం సమగ్రమయిన లెఖలు సేకరించటానికి యీ బిల్లును ఆంధ్రప్రదేశ్ అంతటికి వర్తించేటట్లు చేయాలి. భూ సంస్కరణలకు విరుద్ధంగా ప్రభుత్వముయొక్క వాదన లేక పోయినా, భూస్వాములకు పెద్దవారికి అనుకూలంగా వారి వాదన ఉన్నది

వారివాదన "కరిమింగిన వెలగపండు గదరా సుమతీ" అన్నట్లు ఉన్నది తెలంగాణాలో టెనెన్సీయాక్టు తీసుకురాగానే భూస్వాములు, తమ పిల్లలపేర, కుటుంబములో ఉన్నవారి పేర భూములు విభజించుకొని వేరువేరు పట్టాలు వ్రాయించుకోవడం జరిగింది కుటుంబములోని వారంతా ఒకే యింటిలో ఉన్నా, వారందరు వేరుపడ్డట్టు వ్రాసుకొని భూములువిభజించుకోవటం జరిగింది మొన్న ఏడవ తేదీన అల్లాదుర్గం రాజాగారు వందమంది టెనెన్ట్స్‌ను భూమినుండి వైదొలగించారు ఇక్కడికి టెనెన్ట్స్ వచ్చారు మన పూజ్యనీయులయిన కళా వెంకటరావుగారిదగ్గిరకు వస్తే, వారు ఆఫీసునుండి వెలుపలికి వచ్చి, టెనంట్స్ చెప్పిన విషయాలన్నీ విన్నారు వీళ్ళను ఆ భూములనుండి తీసివేయకూడదని కలెక్టరుగారికి ఆర్డరు పంపించారు ఈరోజున వారికి టెనెన్సీ ఫారమ్స్ ఉండి, పొజెషన్‌లో ఉన్నప్పటికి, దొరలు వాళ్ళను వెళ్ళకొట్టే ప్రయత్నం చేస్తున్నారు కాబట్టి యీ సవరణ ప్రభుత్వం ఒప్పుకోకపోతే, భూస్వాములు తమ భూములు అమ్ముకోవటం, విభజించుకోవటం చేస్తారు మన గోపాలకృష్ణయ్యగారు చెప్పిన విధానాలన్నీ వారు ప్రయోగిస్తారు పది ఎకరాలకంటె ఎక్కువ ఉన్నవారు లెక్కలు చెప్పాలని అంటే అది చాలా బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ ఇప్పుడు చెప్పవలసింది జనరల్ ఉపన్యాసం కాదు సవరణలు గురించి చెప్పండి

శ్రీ బసవ మానయ్య కాబట్టి, యీ బిల్లులో "భూములు విభజింపకూడదు, విక్రయింపకూడదు, ఇతరులపేర వ్రాసుకోకూడదు" అని ఉండటం అవసరము ఇప్పుడు 20 ఎకరాలపైన ఉన్నవారు లెక్కలు తెలుపుకోవాలంటే, అంతకుపైన భూమి ఉన్నవారు అమ్ముకోటానికి ప్రయత్నం చేస్తారు కాబట్టి భూమి విక్రయించటం చెల్లదు అన్నదానిని యీ బిల్లులో తీసుకురావలసిన అవసరము ఉన్నది,

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఈ రెండూ, ముఖ్యమైన అమెండ్‌మెంట్ల క్రింద మేముభావిస్తున్నాము. శ్రీ కృష్ణంరాజబహద్దూర్ గారు, శ్రీ రాఘవులు గారు ఇచ్చిన ఉపన్యాసాలు మనం విన్నాము మనదేశంలో ఉన్నటువంటి ప్రధాన రాజకీయపక్షాలు చెప్పిన భూసంస్కరణలు సక్రమంగా అమలు జరగాలన్నట్లయితే తప్పనిసరిగా మేము సూచించిన అమెండ్‌మెంట్లలో ఏదో ఒకటి అంగీకరించవలసిఉన్నది భూసంస్కరణలు అంటే, అందరికి భూమి పంచిపెట్టటం కాదు. భూసంస్కరణ ఉద్దేశం ఎక్కువ పంట పండించటమే" అని అధికారంలో

ఉన్న పార్టీలోని కొందరు సభ్యులు అంటున్నారు ఈ విధంగా యీ చట్టాన్ని రూపొందించటానికి ప్రయత్నం చేయటం జరుగుతున్నది "భూస్వాములు ఇతరులకు భూమిఇచ్చుకునే అవకాశంఉండాలని" రాఘవులుగారు చెప్పారు వారు కొంత అమాయకంగా మాట్లాడారేమోనని నాకు అనిపిస్తున్నది ఏ భూస్వామి అయినా, గ్రామాలలో ఉండే వ్యవసాయ కూలీలకు ఒక ఎకరంకాదు, అర ఎకరంకాదు, ఒక సెంటు భూమి అయినా ఇచ్చిన ఘటనలు ఉన్నాయా అన్నది ఆలోచిస్తే. ఒక్క భూస్వామికూడ ఆ విధంగా వ్యవసాయ కూలీలకు భూమి ఇచ్చినట్లు మనకు కనుపించదు ఒకరిదగ్గర 30 ఎకరాలు ఉంటే, అందులో పది ఎకరాలు పోతుందేమో, ఆ పది ఎకరాలు పోకుండా ఎట్లా కాపాడుకోవాలని, పన్నుతున్న పన్నాగాలు, అరికట్టాలని నేను చెబుతున్నాను మిగిలి ఉన్న భూమిని పేదప్రజలకు వ్యవసాయకూలీలకు పంచాలనే ఉద్దేశముతో చేసేవే భూసంస్కరణలు, తక్కినవి భూసంస్కరణలు కావు అని నేను ఖచ్చితంగా చెబుతున్నాను, మేమేకాదు చెబుతున్నది దేశంలోని అన్ని పార్టీలవారు అదేవిషయం చెబుతున్నారు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటి ఎకనమిక్ రెవ్యూలో వ్యక్తపరుస్తున్న అభిప్రాయాలుకూడ అవే ఈ అభిప్రాయాలకు దోహదం చేసేవిధంగా యీ అమెండ్‌మెంటు తీకువచ్చాము ఈ సవరణను మంత్రిగారు అంగీకరించవలసిఉన్నది "నేను తెచ్చిన భూమికి సంబంధించిన చట్టాలు రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో పెట్టాను 1948 ఎస్టేటు ఎబాలిషన్‌యాక్టు రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో పెట్టాను. అదేవిధంగా, భూసంస్కరణల చట్టంకూడ రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో తీసుకువస్తాను" అని మంత్రిగారు చెప్పవచ్చును ఇదివరకు ఆవిధంగా మంత్రిగారు తీసుకొనివచ్చి ఉండవచ్చును కాని భూసంస్కరణలచట్టం రెట్రాస్పెక్టివ్ ఎఫెక్ట్‌తో అమలుజరపటం దుస్సాధ్యమైనది అన్న సంగతి మరచిపోకూడదు

మనకు భూసంస్కరణలు అమలు జరుగబోతున్నప్పుడు ముందు ప్రభుత్వమే ఎందుకు అవకాశము యివ్వాలి? పంచుకొండి అని ప్రభుత్వమే ఎందుకు హెచ్చరించాలి? పంచుకున్న తరువాతనే మేము చట్టం తెచ్చిపెట్టుతామని ఎందుకు చెప్పాలి? ఆ కారణముచేత అవి మనయొక్క సమస్యలను క్లిష్టము చేయడము తప్ప సరియైనవిగా కూడ ఉండవని మీదృష్టికి తెస్తున్నాను ఇటీవల చేస్తున్నవి అన్ని **Benami transactions** అని మేము మీ దృష్టికి తెచ్చినప్పుడు, యిది ప్రధానమైన సమస్య గనుక, యీ చట్టమును **evade** చేయటానికి, దీనిని నిరుపయోగము చేయటానికి ఇంతకంటె మాకు భూమి ఎక్కువగా ఏమీలేదని చెప్పే తెలివిలు భూస్వాములను **safe-guard** చేయటానికి ప్రయత్నములు జరు

గుతూన్నవి గనుక ఆ transactions అన్నీ రద్దుచేయాలి అలాంటి transactions జరగకుండ చేయటానికి ప్రతిఘటించాలనే warning యిందులో ఉండాలి అనే అభిప్రాయమును వ్యక్తపరచటానికే దీనిలోనికి తీసుకునివచ్చి చెబుతున్నాము అయితే యిప్పుడు యివి అన్నీ చేసేటప్పుడు కొన్ని సాధకబాధకాలు వస్తాయనే ఉద్దేశ్యముతోనే అవి బినామి అని చెబుతున్నాము ఈ Land Reforms వచ్చినప్పుడు అవి అన్నీ రుజువు చేయుటకు అవకాశముకూడ ఉండాలి అని చెప్పాము ఇవి అన్నీ రుజువు చేయటానికే ప్రయత్నిస్తాము వీటిని రుజువుచేయవలెననే దానికి తగిన చర్యలు అన్నీకూడ రూల్సుద్వారా చేయటానికి కూడ ఏర్పాటు చేసుకోవచ్చు అది చేయటము ఏమంత కష్టతరమైన విషయముకాదు. మీరు లెక్కలుచూపించండి తరువాత చేయగలిగినది చేస్తాము ఈరోజున నాకు యాభై యకరాలు ఉందనుకొండి అందులోది 30 ఎకరాలు యింకొకరి పేర పెట్టుతాను తరువాత దానిని పొందటానికి ప్రయత్నిస్తాను. ప్రభుత్వము తెచ్చే Land Reforms ద్వారా భూమి పంపిణీ చేయటానికి అది ఏ విధముగ సహాకరిస్తుందో నా కేమీ అర్థము కావడములేదు అందువల్ల ప్రభుత్వము ప్రకటించిన ప్రకారము భూసంస్కరణలు తీసుకుని రావటానికి అవసరమైన statistics సేకరించటానికి యీ అర్డినెన్సు ప్రకటించారు గనుక, దానిమీద ప్రభుత్వము నిలబడితే దాని కనుగుణ్యముగ మేము తీసుకొనివచ్చిన సవరణ అవసరమైనదని మంత్రిగారికి సవినయముగ మనవిచేస్తున్నాను మంత్రిగారుకూడ దీన్ని ఆలోచించవలసిన అవసర మున్నది లేకపోతే యిదివరకు చేసిన చట్టములు కొంతవరకు ఉపయోగపడినప్పటికినీ యికముందు రాబోయే చట్టములు మాత్రము మిత్రులు తెలియజేసినట్లు కరిమింగిన వెలగపండు సామెతగా అవుతుంది కాని అంతకంటే ఏమీ ఉండదని నేను మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. కాబట్టి యిప్పుడే లెక్కలు తీసుకోమనండి ఉదాహరణ చెప్పాలంటే, గుంటూరుజిల్లా పోయి మంత్రిగారిని పర్యటన చేయమనండి, వారికి అక్కడ ఒక్క సెంటు భూమిఅయినా దొరుకుతుందేమో చూచుకోమనండి. లేకపోతే కృష్ణాజిల్లాలో వస్తుందేమో చూడమనండి అప్పుడే అన్యాక్రాంతాలు చేసివేస్తున్నారు ప్రభుత్వము యీ భూసంస్కరణలను గురించి అనుసరించే విధానమువల్ల భూమి ఏమాత్రముకూడ మిగలకుండా పోయే ప్రమాదమున్నది ప్రమాదమేకాదు, ఈ transactions అన్నీ జరగడమనేది యిప్పటికప్పుడే చూస్తూనేఉన్నాము అలాంటివి జరుగుతున్నప్పుడు, భూ సంస్కరణలు తెచ్చి, ఏదోచేస్తామని చెబుతున్నారు ఒకవైపున నిర్ణీతమైన విధానమని చెప్పడము ఇంకొకవైపున భూసంస్కరణలు వచ్చినా ప్రయోజనము లేకుండా చేయడము, దానికితోడుగ లక్ష్మణదాసుగారు దోహదమిచ్చే విష

యాలు మాట్లాడడము కన్పిస్తున్నది ఇవిఅన్నీ చూస్తే, చాలా విచారకరమైన విషయములని చెబుతూ, మేముతెచ్చిన సవరణను తప్పకుండా బలపరచవలసిందిగా కోరుతున్నాము ఇంకను చాలామంది అనేకచోట్లలో భూములు ఉన్నవని చెబుతున్నారు అవి అన్నీకూడ రావాలంటే ఎట్లాగు వస్తాయి ? కొంతమంది మిత్రులు మాట్లాడుతూ, భూసంస్కరణలు రావాలని మేముకూడ కోరుతూనే ఉన్నామని ఒకవైపున చెబుతూ, ఇంకొకవైపున లక్ష్మణదాసుగారు చెప్పినట్లు చంద్రమండలములో భూమి ఉన్నది, ఆ భూమి అంతాకూడ ఎట్లా వస్తుందని అన్నారు ఇవిఅన్నీ వింటూంటే, అసలు యీ సమస్య పరిష్కారము కాకుండా చేయడానికి అన్నీ అడ్డంకులు చెప్పడంతప్ప మరేమికాదు అక్కడ ఏ భూమి ఉన్నప్పటికినీ, యీ రాష్ట్రములోని భూమిని రాష్ట్రప్రజానీకానికినీ, చంద్రమండలములో ఉన్న భూమిని లక్ష్మణదాసుగారిపేర బెట్టి, విదేశాలలో ఉన్న భూమిని వెంకట్రాజుగారిపేర బెట్టి, మన రాష్ట్రములోని భూమిని అయినా ముందు గణనలోకి వచ్చేటట్లుగా చేసి, దానిప్రకారము తప్పనిసరిగా నిజమైన భూసంస్కరణలు తీసుకునిరావాలని విజ్ఞప్తిచేస్తూ మా సవరణలు అంగీకరించవలసిందిగా కోరుతున్నాను

శ్రీ ఎ. బాపినీడు (కొవ్వూరు - జనరల్) అధ్యక్షా, ప్రతిపక్ష నాయకులు తీసుకునివచ్చిన సవరణను నేను వ్యతిరేకిస్తున్నాను. ఈ సవరణను గురించి నేను కొన్ని విషయాలను మీ దృష్టికి తెస్తున్నాను ప్రతిపక్షమువారు మాట్లాడుతూ పెద్దపెద్ద భూస్వాముల యొక్క భూములు పోవాలి, ఒక్కొక్కరికి 20 ఎకరాలకు limit చేసి పంచాలి, కూతురుకు వాటా పెట్టకూడదు, కొడుకులకు వాటా పెట్టకూడదు, కట్నాలక్రింద వచ్చిన భూమి వ్రాయకూడదు అనే విషయాలను ఉద్ఘాటించే మహానుభావులు I st class T A draw చేస్తూ, III class లో వస్తూవున్నారు ఇలాంటి విషయాలు యితరులకు చెప్పదలచినప్పుడు III class లో వచ్చేవారు III class T A draw చేస్తూఉంటే అందరికీ చెప్పవచ్చు కాని I st class T A. draw చేస్తూ I st class లో వస్తూండేవారు యిలాంటి విషయాలు చెప్పరు. ఇప్పుడు భూముల విస్తీర్ణములను గురించి లెక్కలు సేకరించటానికి ordinance పెట్టినందుకు మన రెవిన్యూమంత్రి కళా వెంకట్రావుగారిని నేను అభినందిస్తున్నాను ప్రభుత్వానికి వ్యవసాయరంగము ద్వారా ఒక కోటి రూపాయలు ఆదాయము వస్తున్నది. తరతరాల నుంచి వచ్చే ఆచారాలు, తండ్రులకు కొడుకులకు వచ్చే తగాదాలు గాని, కూతుళ్లకు తండ్రులకు పడే తగాదాలు గాని, యీ కట్నాలద్వారా వచ్చే తగాదాలుగాని, కుటుంబములోని వారి మధ్య పార్టీషను తగాదాలుగాని, యింకా యితరత్రా వచ్చే తగాదాలు

గాని యీ ordinance ద్వారా తీరిపోతాయి అని చెప్పటానికి నేను చాలా సంతోషిస్తున్నాను వాస్తవిక పరిస్థితులు మనవిచేయాలంటే, ఉద్యోగస్థులు తమ జీతాలు నెల కాగానే నిలకడగ పుచ్చుకునే మాదిరిగను, డబ్బుగలవారు బ్యాంకులలో నుంచి డ్రాచేసుకునే మాదిరిగ, వ్యాపారస్థులకు shops మాదిరిగ, ఎట్లు డబ్బు ఉపయోగించుకుంటున్నారో, వ్యవసాయము మీద ఆధారపడి జీవించేవారు కూడ తరతరాల నుంచి భూములను నమ్ముకుని, కష్టపడి పండించు కున్న పంటను తెచ్చుకుని జీవించడము కూడ అట్లేనని గుర్తించవలసిందిగ కోరు తున్నాను ఇలాంటి విధముగ అనుభవిస్తున్న భూములమీద సీలింగు పెట్టటానికి, భూసంస్కరణలు కావాలని పెద్దలనుంచి చిన్నవారి వరకు కోరుతూ ఉపన్యాసాలు చేస్తున్నాము భూసంస్కరణలు రావడము ఎవ్వరికీ గూడ అభ్యంతరము లేదని ఇక్కడఉన్న అన్నిపార్టీలవారు చెబుతూనేఉన్నారు నిజమే Ordinance లో 20 ఎకరాలు, అంతకంటె మించిఉన్నవారు లెక్కలు ప్రభుత్వానికి అందజేయవలసిందని ప్రకటించారు భూసంస్కరణలు ప్రవేశపెట్టేటట్లయితే, భూమికి ఒక్కొక్క కుటుంబములో ఎంత కనిష్ట, గరిష్ట ప్రమాణములు ఉండాలి, అది ఏ విధముగ ఉండాలి అనే విషయములు మాత్రము చర్చనీయాంశములు 1957 వ సం లో పుట్టిన దస్తావేజులు గాని, 1935 వ సం లో పుట్టిన దస్తావేజులు గాని, అన్నికూడ రద్దుకావాలి అనే విషయమును మన ప్రతిపక్ష నాయకులు చెబుతున్నప్పటికినీ, అవి రద్దుకావడమనేది అసంభవమైన విషయము అది జరిగే విషయము కాదు ఇవిగాక మిగతావిషయాలుకూడ చెబుతున్నాను ప్రతిపక్షము వారు యింకొక విషయముకూడ చెబుతున్నారు భూసంస్కరణలు ప్రభుత్వము ప్రవేశపెట్ట బోతున్నదని వదంతులు బయలుదేరినప్పటినుంచి, భూస్వాములు తమయొక్క భూములకు సీలింగు పెట్టబోతారు, మిగతా భూములు యితరులకు పంచిపెట్టబోతారు అనే భీతాందోళనవల్ల ముందుగానే benami transactions జరుపుతున్నారు అవి అన్నీ రద్దుకావాలి అని అంటున్నారు. అయితే legal sense లో benami అంటే ఏమిటి ? వాటిని రద్దుచేయడానికి ప్రభుత్వానికి హక్కుగలదా ? దీనికి చిన్న ఉదాహరణ చెబుతున్నాను. అప్పులు రద్దుకావాలని అంటున్నాము వడ్డీ రద్దుచేస్తే చేయవచ్చుగాని, అసలు అప్పు రద్దుచేయటానికి ఎవరికీగూడ హక్కులేదు. Transfer of Property Act ను బట్టి benami transactions అంటే ఏమిటి ? ప్రతివారు, బినామి, బినామి అని మాట్లాడుతున్నారు. తండ్రి తనకు ఉన్న ఆస్తిలో తన కుమారునికి వాటావ్రాస్తే అది బినామియా ? తన కూతురుకు వాటా వ్రాస్తే అది బినామియా ? కాదు, తన బావమరిదిపేర వ్రాస్తే అది బినామియా ? కాబట్టి ఇలాంటివాటిలో బినామి అంటే అర్థము లేదు ఇదికాక, భూమి యితరులపేర నామకః పెట్టి

తిరిగి అందులోని ఆదాయము తానే అనుభవిస్తున్నాడని, అది బినామి అంటే, అది రుజువు చేయవలసియున్నది ప్రతిపక్షసభ్యులు ఎన్ని పెద్దపెద్ద ఉపన్యాసాలు చేసినా, అవి అన్నీ ఉపయోగించేవికావు మన వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ పాత స్టాంపులు తెచ్చి దస్తావేజులు వ్రాసుకొంటున్నారని అన్నారు దేనికి పాత స్టాంపులు అవసరములేదు ఎవరో తెలివి తక్కువవారు, అమాయకులైనవారు రూల్సు తెలియకుండా ఎక్కువగ డబ్బు ఖర్చుచేసి వ్రాసుకుని ఉంటే ఉండవచ్చు, ఈ విషయము గురించి నా అభిప్రాయము నేను చెబుతున్నాను బ్యాంకులలో డబ్బు వేసుకున్నవారు, ఆడబ్బు ఎవరిపేరట అయితే ఉంటుందో, వారి యిష్టము వచ్చినప్పుడు వారు draw చేసుకోటానికి సర్వహక్కులు ఏ విధముగ ఉంటాయో అలాగే ఏ ఆసామిపేర ఉన్న భూమి ఆ ఆసామి తన యిష్టము వచ్చినప్పుడు అమ్ముకోటానికి సర్వహక్కులు కలిగి ఉంటాడు ఈ హక్కును ఎవ్వరూ కూడ తీసివేయలేరు భూసంస్కరణలు ప్రవేశపెట్టినట్లయితే సీలింగు 20 ఎకరాలకు పెట్టుతారో, యింకా ఎంతకు పెట్టుతారో, ఏమి జరుగుతుందో ఎవరు చూచారు? ఇతర రాష్ట్రాలు ఉన్నవి పైన కేంద్ర ప్రభుత్వము ప్లానింగు కమిటీవారు ఉన్నారు వారు ఏలాంటి శాసనము చేస్తారో, ఏవిధమైన సూచనలు చేస్తారో, ఆవిధముగ జరుగుతుందితప్ప మనము ముందుగానే భూముల పంపిణీ సంగతి, అంత పంచాలి, యింత పంచాలి అని అంటే, ఎవరిభూమి పంచాలి? ఎవరికి పంచాలి? ఎక్కడనుంచి పంచాలి? ఇదంతయు చూస్తే కాలహరణంతప్ప ఉపయోగించే విషయాలు ఏమీ కావు. ప్రతిపక్షమువారు చెప్పేబినామి transactions రద్దు చేయాలి అని చెప్పే మాటలు జరిగేవికావు అవి అన్నీ అసంభవమైన విషయాలు, జరగవు పైగా, ఆయిదు ఎకరాలు పంచుదాము, పది ఎకరాలు పంచుదాము అని చెప్పే విషయాలు ప్రయోజనకరమైనవికావు, ఈ ఉపన్యాసాలు కబుర్లు, మామూలుగా మనము election propaganda సందర్భములో పల్లెలకుపోయి అక్కడ అమాయక ప్రజలకు "సోదరులారా" అంటూ చెప్పే జరుగుబాటు ఉపన్యాసాలేనని అంటున్నాను. అందువల్ల నేను ఒక్కటే విషయము మనవి చేస్తున్నాను ఏరోజున అయితే Ordinance తరువాత బిల్లు వచ్చేవరకు, అది retrospective effect తో కూడి ఉండకుండా ఉన్నంతవరకు, ఎవరిభూమి వారు వారి యిష్టప్రకారము అమ్ముకోవచ్చు, ధర్మము చేసుకోవచ్చు, దానముకూడ చేసుకోవచ్చు. అంతేకాని ఇప్పుడు ప్రతిపక్ష సభ్యులు మాట్లాడే దానిలో అర్థములేదు. ఇంతవరకు వ్రాసుకున్నవి ఏ విధముగాను benami కావు, అని అందరికీ తెలియచేస్తున్నాను. అందువల్ల యిప్పుడు ప్రతిపక్షమువారు తెచ్చిన సవరణ సాధ్యమైనది కాదుగనుక దానిని నేను వ్యతిరేకిస్తున్నాను.

*Sri Vavilala Gopalakrishnayya* On a point of explanation, Sir బాపినీడుగారు I st class T A draw చేస్తూ III class లో వస్తున్నారని అన్నారు కాని నేను ఆ విధముగ చేయడములేదు అని చెబుతున్నాను

శ్రీ యల్ లక్ష్మణదాసు అధ్యక్షా, నేను యీ amendment ను వ్యతిరేకిస్తున్నాను ప్రతిపక్ష సభ్యులు బినామీ transactions ఎవరో జరుపుతున్నారని అన్నారు తండ్రి తన కుమారునికి గాని, కుమార్తెకుగాని తన భూమి వ్రాస్తే అది బినామీ transaction ఎట్లా అవుతుంది ? నిజంగా బినామీ వ్యవహారము అయితేనే అది చెల్లనుగాని, యిలాంటివి చెల్లుతవి ఇందాక నా మిత్రుడు land reforms ను గురించి మాట్లాడుతూ, కాంగ్రెసు గవర్నమెంటుకు ఒక policy అనేది లేదు అని అన్నారు కాంగ్రెసు గవర్నమెంటుకు పాలసీ లేకపో లేదు ఆ పాలసీని నిర్దుష్టంగా step by step అమలు జరుపుతున్నదన్న విషయం అన్నిపార్టీలవారికి తెలుసు ఆనాడు కాంగ్రెసు గవర్నమెంటు జమీందారీలు రద్దుచేసే విషయంలో opposition party వారిసలహాలను తీసుకొని చేయలేదు కాకపోతే States Reorganization జరిగేటప్పుడు Opposition Party వారి సలహాలు సూచనలు కాంగ్రెసు ప్రభుత్వం అంగీకరించలేదు కాంగ్రెసు గవర్నమెంటు ఎన్నిపనులు చేసినా దేశాభివృద్ధి దృష్ట్యా అందరికి సరిసమానంగా తిండి ఉండాలి అనే ఉద్దేశ్యముతోనే ప్రాజెక్టులు, irrigation schemes, planning కార్యక్రమాలు step by step గా నిర్వహిస్తూ వస్తున్నది అంతే కాని ప్రతిపక్ష సభ్యులు ప్రజలనందరినీ, ఉద్ధరిస్తాము అని, అక్కడ అనవసరమైన కబుర్లుచెప్పిన రీతిగా కాంగ్రెసుపార్టీవారు ఎన్నడు చెప్పలేదు Election-manifesto లో స్పష్టముగ చెప్పబడింది అటువంటి రైతులు యీనాడు benami transactions చేసుకోనక్కరలేదు Election manifesto ను అంగీకరించే కాంగ్రెసుపార్టీ యీ ప్రభుత్వాన్ని యిక్కడ నిలబెట్టింది ప్రజానీకములో మెజారిటీ రైతాంగము ఉన్నది అందువల్ల యీరోజున దీనిని కొత్తగా తీసుకుని వచ్చిందికాదు. అంతేగాని ఎవ్వరుకూడా గాభరా వడవలసిన అవసరములేదు కాంగ్రెసు ప్రభుత్వము ఒక నిర్దుష్టమైన కార్యక్రమము అమలు జరపటానికి పూనుకున్నది ఏ రోజున ఎవరు ఏమి చేయాలి, అనేది ఆలోచించి step by step చేస్తూ వస్తూన్నది గాని ఇది Opposition Party win over చేయాలని కాదు.

అధ్యక్షా, మీకు తెలుసును, కర్నూలులో మద్యపాన నిషేధంగురించి ప్రజానీకం వ్యతిరేకంగా వున్నారని అనేకమంది చెప్పినా ఆనాడు prohibition policy మీద కాంగ్రెసు గట్టిగా నిలబడి....

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఇప్పుడు వారు మాట్లాడేదంతా యీ చర్చకు ఏరకంగా relevant ? మమ్ములనుకూడా అట్లానే మాట్లాడనిస్తారా ?

మిస్టర్ స్పీకర్ మీరంతా ఎట్లా మాట్లాడుతున్నారో వారుకూడా అట్లానే మాట్లాడుతున్నారు

శ్రీ పి సుందరయ్య ఇకముందు మేముకూడా అట్లానే మాట్లాడుతాము

శ్రీ ఎల్ లక్ష్మణదాసు అది "రెలవెంట్" అవునా అని శ్రీ సుందరయ్యగారన్నారు కాంగ్రెసుకు ఒక నిర్దుష్టమయిన policy లేదని వారు చెప్పినందుకు మాకు policy వుందని వివరించాను

మిస్టర్ స్పీకర్ · అది చాలా relevant

శ్రీ పి సుందరయ్య దీనికి Prohibition అనేది చాలా relevant.

మిస్టర్ స్పీకర్ · 'step by step పోతున్నాము' అని వారు చెప్పారు అంతమాత్రంచేత యిబ్బంది లేదు చెప్పనీయండి So long as it is not unparliamentary or indecent, సుమారుగా అటూ యిటూ మాట్లాడినా ఫర్వాలేదు I am going to allow it అందరికీ freedom of speech యిచ్చాను అందరినీ allow చేస్తున్నాను కాబట్టి Prohibition గురించి ఒకమాటచెప్పారు

శ్రీ ఎల్. లక్ష్మణదాసు అధ్యక్షా, అందుచేత మనవిచేస్తున్నాను. కాంగ్రెసు ప్రభుత్వం నిర్దుష్టమయిన ఒక policy మీదనే, కార్యక్రమం మీదనే అడుగు తరువాత అడుగు వేసుకొని వెళ్ళుచున్నది. దాంట్లో ప్రతిపక్షంవారి సలహాలు మాకు అక్కరలేదు ఎవరేమనుకున్నా ప్రజానీకం ఎదుట manifesto లో మా కార్యక్రమాన్ని వివరించాము. తరువాత బినామీ transactions అంటున్నారు. తన ఆస్తి తన కుమారుడికి . .

శ్రీ పి. సుందరయ్య : శాసనసభ్యుల సలహాలు వారు తీసుకుంటారని మేము అనుకుంటలేదా ? వారిదృష్టి ఎక్కడుందో మాకు తెలుసును.

శ్రీ ఎల్ లక్ష్మణదాసు మేము యీ విషయాలలో మా policy కి వ్యతిరేకంగా వచ్చే ఉద్దేశ్యాలను తీసుకోము కాంగ్రెసు ప్రభుత్వం ఆ నిర్ణయం తోనే వెళుతుంది తనపని చేస్తుంది

శ్రీ పి సుందరయ్య వారికి ప్రజల ఉద్దేశంతోనే అవసరం లేదు.

శ్రీ ఎల్ లక్ష్మణదాసు ప్రజల ఉద్దేశ్యంతోనే మేము వున్నాంకాబట్టి యీ రోజున పరిపాలన చేస్తున్నాం ఇంకో 20 సంవత్సరాలయినా పరిపాలన చేస్తాం

శ్రీ పి సుందరయ్య శాశ్వతంగా రెండు వేల యేండ్లు పరిపాలన చేయవచ్చు మాకేమీ అభ్యంతరంలేదు

శ్రీ ఎల్ లక్ష్మణదాసు నేను చెప్పేవిషయాలను వారు వినాలని మనవి చేస్తున్నాను

శ్రీ పి సుందరయ్య ఎందుకని వినాలి ?

శ్రీ ఎల్. లక్ష్మణదాసు ఎవరికి ఎన్ని ఎకరాల భూమివుంది, అనే బిల్లు వచ్చినప్పుడు ఎటువంటి చర్చలు చేసుకోవాలి అన్నది వేరే సంగతి ఈనాడు లెక్కలను గురించి వచ్చిన బిల్లు యిది ఈలోగా ఒకని పెద్దకుమారుడు తన ఆస్తిలోని భాగమును పంచి యిమ్మంటే నిరాకరించే అధికారం తండ్రికిలేదు కుమారునికి తండ్రి ఆస్తిలోని వాటా కోరేహక్కు వుందని మనవి చేస్తున్నాను భూసంస్కరణలు తెస్తామని మా election manifesto లోనే చెప్పాము. ఒక మిత్రుడు నేను చంద్రుని గురించి చెప్పావన్నారు నిజమే Guide to Moonఅని ఒక పుస్తకం వ్రాశారు అయితే చంద్రమండలానికి నన్ను పంపిస్తామన్నారు గాని ఆ అదృష్టం నాకు పట్టదు ఎందుకంటే నేను శ్రీ వెంకటేశ్వర్లుతో ఆ పార్టీలో కలిస్తే నాకే ముందువెళ్ళే అదృష్టం వుంటుదో లేక వెంకటేశ్వర్లుకే ముందు వెళ్ళే అవకాశం వుంటుందో

మిస్టర్ స్పీకర్ : "శ్రీ వెంకటేశ్వర్లుగారు" అనండి

శ్రీ పి. సుందరయ్య అమెరికావాళ్ళు త్వరగా తీసుకోబోతున్నారు వారిని అమెరికా వెళ్ళి విమానం ఎక్కమనండి

శ్రీ ఎల్. లక్ష్మణదాసు . శ్రీ వెంకటేశ్వర్లుగారితో నేను కలిస్తేనే నాకు ఆ అదృష్టం కలుగుతుంది, లేకపోతే కలుగదేమో అందుకోసం యీ సవరణ ఇక్కడ అవసరం. ఈ సవరణను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను.

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా నేను చంద్రమండలానికి వెళ్ళలేను, కుజుడి దగ్గరకు వెళ్ళదలచుకోలేదు అమెరికా వారి విమానం ఎక్కనక్కరలేదు, రష్యా వారి స్పుట్నిక్ ఎక్కనక్కరలేదు నేను భూమిమీదే కాపురంచేసి ఇక్కడవుండే ప్రజలకు సేవచేసి, దేవుడు ఎక్కడకు తీసుకువెళతాడో అక్కడికే వెళదాం అనే సంకల్పంతో వున్నాను ఇక్కడున్న సవరణకు ప్రధానమైన కారణం ఆపోహ "ఇలా చేస్తారేమో కొంతమంది ? అలా చేయకుండా ఆపుచేయడం మంచిదనే ఉద్దేశ్యంతో పెట్టా"మని చెబుతున్నారు దీనికంతకీ point of time వుంది ఇప్పుడు యీ amendment కీ, బిల్లుకీ సంబంధంలేదు. ఇది Alienations Prevention Bill అయినట్లయితే న్యాయంగా దీని aspects బినామీ అని పేరు పెట్టడమో good faith, bad faith అనే మాటలు ఉపయోగించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది ఇది వట్టి అంకెలను సేకరించడానికి తెచ్చిన Bill తప్పు అంకెలు వేస్తే punishment దీంట్లోనే వుంది. పత్రికలలో చెప్పినట్లు "Ryots alerted to take some action" అని కాదు కేవలం అంకెలు సేకరించడానికే యీ బిలు తేబడింది ఆ అంకెలను ఎలా వినియోగించుకుంటాం అనే విషయంలో ఎవరు crystal gazing చేసినా తప్పుదోవలోకి వెడతారని నేను అనుకుంటున్నాను రెండు విషయాలు విడదీసుకుని చర్చించితే లాభంలేదు Chaptar 9 of the Second Five-Year Plan లో ఆ రెండు విషయాలూ ఉన్నాయి (1) Increased Production, (2) Surplus land distribution, రెండింటినీ విడదీసుకొని ఒకరు surplus land distribution దృష్టిలో లేదని విమర్శిస్తే, ఆ చేసే distribution వల్ల increased production రాదు అని యింకొకరు విమర్శ చేయడం న్యాయంకాదు రెండింటికీ సమ్మిళితమైన కార్యక్రమం రూపకంగా వ్యవసాయ భూములను అభివృద్ధిలోనికి తీసుకువచ్చి, దేశంలో ఎక్కువ పంటచేసి standard of living ను వృద్ధిచేయాలనే వుద్దేశ్యంతోటి అసలు యిది జరుగుతున్నది ఇది వట్టి subsidiary matter ఇవ్వాళ దీనిని ఆధారం చేసుకుని శాసనసభలో చర్చకువచ్చింది కనుక మనకున్నట్టి భావాలన్నిటినీ దీనిలోపలే ప్రవేశపెట్టేటటువంటి యత్నాన్నే నేను ఎదిరిస్తున్నాను. బినామీ transactions ఆపవచ్చు, ceiling 20 కాకుండా అయిదే పెట్టవచ్చు ఇంకా చర్చలోకి వెళ్లడంవల్ల పొరపాటున నా మనస్సులోని భావాలు పైకివస్తాయనే భయంచేత యింతకంటే చర్చించదలచుకోలేదు ఒక విషయం మాత్రం నిశ్చయము భూసంస్కరణలు నిశ్చయము, భూసంస్కరణలలో ఏమార్పు తీసుకు వస్తాం అనేది ఇంకా నిర్ణయించుకోలేదు. కాని Chapter 9 of the Second Five year Plan పునాది సూత్రాలమీద, యిదివరకు యిక్కడ pass అయినటువంటి Hyderabad Tenancy & Agricultural Lands Act, యీ రెండూ

దృష్టిలో పెట్టుకుని చేయడానికి వీలవుతుందిగాని క్రొత్తగా ఒకదానిని సృష్టించడానికి వీలుండదు ఆ ప్రాతిపదికమీదనే వ్యవహారం జరుగుతుందని తమకు మనవి చేస్తున్నాను ఈ రెండు ఆదర్శాలకూ భంగం కలిగించేవిధంగా దేశంలో వున్నవారు ప్రవర్తిస్తుంటే దానికి తగినటువంటి ప్రతిక్రియను సకాలంలో మనం ఆలోచించవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది నాకు ప్రజలమీద నమ్మకంవుంది పేద ప్రజానీకం గురించి మాట్లాడినప్పుడు వాళ్ళమీద నమ్మకం వుండాలి నమ్మకం లేనప్పుడు వాళ్ళమీద విధినియమాలు పెట్టవలసివుంటుంది ఇప్పుడు దీనికి సంబంధించి ఆ నమ్మకంతోనే, ముందుచెప్పిన రెండుఆదర్శాలతోనూ legislation వస్తుందనేసంగతి ప్రజలకు తెలుసును, ఎవరైనా ఉల్లంఘిద్దామని చేసేయత్నాన్ని సకాలంలో ఆ బిల్లు ప్రవేశపెట్టినప్పుడు ఆ చర్య తీసుకోవాలిగాని లెక్కల కోసమని తెచ్చిన యీ బిల్లును వినియోగించుకుందామనే ఉద్దేశ్యంతో తెచ్చే యీ సవరణ ము అనవసరం వాటిని అంగీకరించడానికి ప్రస్తుతం వీలులేదని మనవి చేస్తున్నాను

*Mr Speaker* I shall first put the amendment of Sri B Sreeramamurthy to vote

The question is

"Add the following as new clause 4 at the end of the existing clause 3 and re-number the remaining clauses .—

'4 Prohibition of alienations —Any alienation, either by way of division, sales, registrations or any documents, which result in the diminution of holdings effected on or after 21st September, 1957, become null and void ' "

The motion was negatived.

*Sri B Sreeramamurthi:* I demand a division, Sir

The House then divided

Ayes .. 30 Noes . 56

The motion was negatived

*Mr Speaker*. The question is :

Add the following at the end of sub clause (1) of Clause 3

"And further, all benami transfers, benami sales, benami partitions, benami gifts made by a landholder of a holding, the total

extent of which exceeds twenty acres of land on the date of commencement of the Ordinance, made for the purpose of evading land reforms, are illegal and void "

The amendment was negatived

*Mr. Speaker* The question is

"That Clause 3 stand part of the Bill "

The motion was adopted

Clause 3 was added to the Bill

*Clause* 4

*Sri G Yellamanda Reddi* Sir, I beg to move

Add the following as Explanation II of Clause 4

"Explanation II On the application of a landholder, the Revenue Officers viz., either village karnam, Revenue Inspector or the Tahsildar concerned shall supply the particulars required in the form of declaration "

*Mr. Speaker* Amendment moved

శ్రీ జి. ఎలమందారెడ్డి ; అధ్యక్షా ! ఈ సవరణ చాలా ముఖ్యమైనది మంత్రిగారు అంగీకరిస్తారనే నేను అభిప్రాయపడుతున్నాను ఇందులో కొత్త విషయమేమీ నేను చేర్చలేదు జాయింటు ఫామిలీకి ఎంతభూమి వుందో తెల్పాలని ఈ ఆర్డినెన్సులో వుంది ఆ family strength ఎంతనే విషయంకూడా తెల్పాలి అది చాలా ఉపయోగముగా వుంటుందని మనవిచేస్తున్నాను Land reforms అనేవి family holdings కు ప్రధానమైనవని ప్లానింగ్ కమిషన్ వారి panel రికమెండు చేసింది Family holdings అనేది strength మీద ఆధారపడి వుంటుంది

శ్రీ కె. వెంకటరావు · అధ్యక్షా ! వారు దేనిమీద మాట్లాడుతున్నారు?

మిస్టర్ స్పీకర్ : వారి సవరణపైన

శ్రీ కె. వెంకటరావు : దానికి దీనికి ఏమీసంబంధము.

*Sri G. Yellamanda Reddi* : I am sorry, sir.

శ్రీ కె వెంకటరావు అధ్యక్షా! దానిలో వ్రాసిన విషయాన్ని నేను అంగీకరిస్తున్నాను వీళ్ళకు కావలసిన information అంతా ఇవ్వవలసినదని village officers కు ఇదివరకే చెప్పాము ప్రతివ్యక్తికి కావలసిన సంజాయిషి ఇవ్వవలసిందని మరల యింకోసారి strict గా instructions ఇస్తాము ధరఖాస్తు పెట్టినవారికి తప్పకుండా వచ్చేటట్లు చూస్తాము

*Sri G Yellamanda Reddi* Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House, withdrawn

*Mr Speaker* Amendments Nos 11 & 17 are not in order Hence I rule them out

*Mr Speaker* The question is

"That Clause 4 stand part of the Bill"

The motion was adopted

Clause 4 was added to the Bill

*Clause 5*

*Mr Speaker* The question is

"That Clause 5 stand part of the Bill."

The motion was adopted

Clause 5 was added to the Bill.

*Clause 6*

*Mr Speaker*. The question is :

"That Clause 6 stand part of the Bill"

The motion was adopted

Clause 6 was added to the Bill

*Clause 7*

*Mr. Speaker:* The question is

"That Clause 7 stand part of the Bill."

The motion was adopted.

Clause 7 was added to the Bill.

*Schedule*

*Mr Speaker* The question is that the Schedule stand part o the Bill.

The motion was adopted

The Schedule was added to the Bill

*Clause* I

*Sri P Sundarayya* Sir, I move the following amendments

(i) "In sub-clause (2) of Clause 1, for the words 'to the territories of the State of Andhra Pradesh' substitute the words 'to the whole State of Andhra Pradesh' "

(ii) Delete the following in sub-clause (2) of clause 1 —

"Which immediately before the 1st November, 1956, were comprised in the State of Andhra."

*Mr. Speaker* · Motions moved

శ్రీ పి సుందరయ్య 'అధ్యక్షా ! నేను నాసవరణలను ప్రతిపాదిస్తున్నాను మిగిలినసవరణలను మంత్రిగారు అంగీకరించకపోఇనా కనీసం ఈసవరణలనైనా అంగీకరించాలని కోరుతున్నాను తెలంగాణా ప్రాంతంలో నివసించేవారికి యీ బిల్లు వర్తించాలనే నాఉద్దేశ్యము ఇది పెద్దగా ఉపయోగించినా, ఉపయోగించక పోయినా ఏదో ఉపయోగిస్తుందని మంత్రిగారి ఉద్దేశం కాబట్టి ఆ ఉపయోగమే తెలంగాణా వాసులకు కూడా కల్పించటం మంచిది కాబట్టి ఈ బిల్లు ఈ ప్రాంతానికి కూడా వర్తింపచేయాలని నేను కోరుతున్నాను ప్లానింగ్ కమిషన్ వారి రిపోర్టులో chapter IX లో వున్న దానిననుసరించి, తెలంగాణాలో చేసిన భూసంస్కరణలననుసరించి నేను తేబోయే భూసంస్కరణలు వుంటా యని మంత్రిగారు చెప్పారు తెలంగాణాలో ఏ విధంగా జరిగాయనే విషయం తెలుసుకోటానికి ఈ లెక్కలు కొంతవరకు ఉపయోగపడవచ్చు ఈ చట్టం లోపభూయిష్టముగావుంది పక్రమముగా లేకపోవచ్చు కాని వున్నంతవరకే తెలంగాణాలో కూడా తీసుకురావటం అవసరం. అందుచేత నా సవరణ అంగీకరించాలని కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు . అధ్యక్షా ! ఆ సవరణను నేను అంగీకరించటంలేదు. ఈ శాసనానికి సంబంధించి, తెలంగాణా లెక్కలు మనవద్ద ఇదివరకే వున్నాయి. కొత్తవి అవసరం లేదని అనుకొన్నాము. అందుచేత వాటిని నేను అంగీకరించటము లేదు.

*Mr Speaker* The question is

"In sub-clause (2) of Clause 1, for the words 'to the territories of the State of Andhra Pradesh' substitute the words 'to the whole State of Andhra Pradesh "

Delete the following in sub-clause (2) of Clause 1

"which immediately before the 1st November, 1956, were comprised in the State of Andhra "

The motions were negatived

*Mr Speaker* The question is

"That Clause 1 stand part of the Bill "

The motion was adopted

Clause 1 was added to the Bill

*Preamble*

*Mr Speaker*. The question is

"That the Preamble stand part of the Bill "

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri K Venkata Rao* I beg to move

"That the Andhra Pradesh Agricultural Holdings (Census) Bil 1957 be passed into law."

*Mr Speaker* Motion moved ·

శ్రీ పి సుందరయ్య : అన్ని సవరణలపైనా చర్చ జరిగింది వాటికి మంత్రిగారు ఇచ్చిన సమాధానమునుబట్టి ఈ బిల్లు ఎందుకు ఉపయోగపడుతుందో నాకు అర్థం కావటం లేదు శ్రీ బాపినీడుగారు, శ్రీ కృష్ణంరాజు బహదూర్ గారు చెప్పినట్లు ఇహాం, పరం రెండింటికోసమే ఈ భూసంస్కరణలు తేబోతున్నారేమో ! "మేము చెబుతున్నాము" అని చెప్పుకోనే దానికి ప్రాతిపదికగా ఈ లెక్కల సేకరణ పనికివస్తుంది కాని, దానివల్ల ఏమీ ఉపయోగం వుండదు ఈ లెక్కలు దేనికీ పనికిరావు కేవలం ఇవి నిరుపయోగమని సవరణపై జరిగిన చర్చలవలన స్పష్టమైనది

ఈ విషయాన్ని నేను యీరోజునే చెప్పడం లేదు మంత్రిగారు లెక్కలు తీసుకువచ్చిన తరువాత అవి భూసంస్కరణలు చేయడానికి ఏరీతిగా ఉపయోగ

పడతాయో, అందులోని లోపాలను చూసుకుంటే అప్పుడే కనబడుతుంది భూసంస్కరణలు మార్చి నెలనాటికి వస్తాయో, జులై నెలనాటికి వస్తాయో తెలియదు ఆ దృష్టితో చూచినప్పటికికూడా యివి ఏరీతిగానూ ఉపయోగ పడవు "మేము భూసంస్కరణలు తెస్తున్నాము, మీ భార్యలపేర కూతుళ్ళ పేర, మనుమలపేర వ్రాసుకోండి" అని యితరులకు ముందుగా warning యివ్వడానికి మాత్రం పనికివస్తుంది తప్పితే యీబిల్లు యింక ఏరీతిగాకూడ ఉపయోగపడదు ప్రభుత్వం దానిని ఆచరణలో పెట్టడానికి ఉపయోగం లేకుండా పోతుంది లక్ష్మణదాసుగారు చెప్పినట్లు వారి కాంగ్రెసు ప్రజాస్వామికం ఉంటుంది, మేము కాదు అనడంలేదు ఇప్పుడు గాని, ఇక ముందు గాని మేము వారితో పోటీ పడదలచుకోలేదు పేదప్రజల దగ్గరనుండి భూములు లాక్కొని భూస్వాములకు యివ్వడం కాంగ్రెసు ప్రజాస్వామికమని మాకు బాగా అర్థం అవుతున్నది మా ప్రజాస్వామికంలో ఎలా వుంటుందంటే మా ప్రజాస్వామికం వస్తుందో, లేదో, నా జీవితంలో చూస్తానో, లేదో చెప్పలేను కానీ ఒకవేళ వస్తేమాత్రం . ఆస్తికి పరిమితిపెట్టి, భూస్వాముల దగ్గరనుంచీ, ధనవంతుల దగ్గరనుంచీ ఆస్తి లాక్కుని పేదప్రజలకు యివ్వడం మా ప్రజాస్వామికంయొక్క లక్ష్యం. ఆ ప్రజాస్వామికం యిష్టం లేకపోతే ..ప్రజల దగ్గరనుంచి భూములుగుంజి భూస్వాములకు యివ్వడమనే కాంగ్రెసు ప్రజాస్వామికాన్ని గురించి మేము మంచిదికాదని చెప్పగలము, తప్పు అని చెప్పగలం తప్పితే యిది ప్రజాస్వామికం కాదని మేము ఎట్లాచెప్పగలం ? "మాది మా ప్రజాస్వామికం, దాని విషయమై ప్రతిపక్షసభ్యుల సలహాలు తీసుకోదలచుకో లేదు మా యిష్టం వచ్చినట్లు చేస్తాము" అంటే దానిని గురించి మాకు ఎటువంటి భ్రమలూ లేవు లక్ష్మణదాసుగారు ప్రతిపక్షసభ్యులు చెప్పినదానికి విలువ యిచ్చి, దాంట్లో ఏమైనా point వుంటే ఆలోచించి చేస్తారని మాకు ఏమూలనైనా భ్రమలువున్నాయేమో అనుకొని "మీరు ఆ భ్రమలుకూడా పెట్టుకోవద్దు. ప్రతిపక్షం ప్రతిపక్షమే. మాపక్షం, మాపక్షమే. మీదంతా రష్యా, మాదంతా అమెరికా, మీరంతా చంద్రులు, మేమంతా సూర్యులం" అనేరీతిగా వారు మాట్లాడవచ్చు. మాకేమీ అభ్యంతరం లేదు వారి యిష్టంవచ్చినట్లు మాట్లాడవచ్చు. ఈ సందర్భంలో ఒక్క విషయం చెప్పదలచుకున్నాను ఎప్పుడయినా కాస్త కోపం వచ్చినప్పుడో, serious గా చర్చ జరుగుతున్నప్పుడో ఒకపైరివొకరు విసురుకోవడం జరగవచ్చు ఒకరి సిద్ధాంతాలు ఒకరు చెప్పదలచుకొన్నా....అట్లా చేసుకోవచ్చు. దానికి నేను కాదనను ఇటువంటి చర్చలు వచ్చినప్పుడు మేము ఊరుకుంటూనే ఉన్నాము. ఈరీతిగా శాసనసభలోని కొంత [illegible] గురించి కాకుండా కమ్యూనిస్టు సిద్ధాంతాలు ఏమిటి? కాంగ్రెస్

సిద్ధాంతాలు ఏమిటి? కాంగ్రెసు ప్రజాస్వామికం ఏమిటి ? కమ్యూనిస్టు ప్రజాస్వామికం ఏమిటి? అనే చర్చలు మొదలు పెట్టినట్లయితే చర్చించుకోవచ్చు వారు చెప్పేది మేము విననవసరం లేదు, మేము చెప్పేది వారు విననవసరం లేదు

శ్రీ యల్ లక్ష్మణదాస్ అధ్యక్షా .

*Sri P Sundarayya* I am not yielding అందుచేత ఒకరి చర్చ నొకరు వినదలచుకోనప్పుడు వినదలచుకోకుండా కార్యక్రమం జరుపుకోవచ్చు మామాట వారు వినదలచుకోకపోతే వారిమాట మేము వినదలచుకోలేదు తగాదాయేలేదు నేనూ interrupt చేయగలను వారూ interrupt చేయగలరు కాని యిప్పుడున్న సమస్య అది కాదు వారి ప్రజాస్వామికాన్ని మేము మార్చగలమని కాని, మా ప్రజాస్వామికాన్ని వారు మార్చగలరనికాని కాదు ఇద్దరి ప్రజాస్వామికాలనూ మార్చగలిగిన ప్రజలే ఉన్నారు వారికి ఏ ప్రజాస్వామికం కావాలంటే అదే తీసుకుంటారు కాంగ్రెసు ప్రజాస్వామికం కావాలని ప్రజలలో ఎక్కువమంది ఓటు చేశారు అందువల్లనే వారు 250 మంది అక్కడ ఉంటున్నారు

*Mr Speaker* Please adress the Chair

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా మేము మాట్లాడేటప్పుడు మిమ్ములను వారి తరపున పెడుతున్నాము వారు మాట్లాడేటప్పుడు మిమ్ములను మా తరపున పెడుతున్నారు మీరు నిష్పక్షపాతంగానే ఉంటున్నారు. (నవ్వులు) అందుచేత మీరు అంటే ప్రత్యేకం మీరుగాదు మీ ద్వారావారు. వారు చెప్పినప్పుడు కూడా 'మీరు' అంటే మీరు కాదు మీద్వారా మేము క్లుప్తంగా వారు, వారు అనడంకంటే 'మీరు' వారు అంటూ యిద్దరినీ కలగూర గంపగా చేయడం జరుగుతూ ఉంటుంది మమ్ములను ఎత్తి పొడవదలచుకొంటే అస్త్రమాను dull గా ముఖాలు ముడుచుకొని కూర్చోకుండా ఒక పర్యాయం ఎత్తిపొడిస్తే సరసంగానూ, వేళాకోళంగానూ ఉంటుంది. అంతేగాని అవకాశం

వున్నా లేకపోయినా సందర్భం ఉన్నా, లేకపోయినా ఎత్తిపొడవడం మొదలు పెట్టినట్లయితే అట్లా మేమూ ఎత్తిపొడవగలము మేమూ కేకలు వేయగలము 250 మంది వేసినంతగా మేమూ వేయగలము కాని యిప్పుడు అది కాదు సమస్య ఈ రెండు ప్రజాస్వామ్య సిద్ధాంతాలు ఏమిటి, వాటివల్ల ఉపయోగం ఉందా, లేదా అనేది ఎన్నికలలో చర్చించుకొంటున్నాము రోజూ చర్చించు కొంటున్నాము దానికి ప్రజలే తీర్పు చెబుతారు వారూ, మనం ఎప్పుడూ చర్చించుకోవచ్చును ఈ విషయంలో యింతకంటె ఎక్కువగా నేను యిప్పుడు పోదలచుకోలేదు

ఈ బిల్లుమాత్రం నిరుపయోగమైనది ఇందులో సక్రమమైన లెక్కలు లేవు ఇది భూసంస్కరణలు తేవడానికి గాని, పన్నులచట్టాలు తీసుకువచ్చేదానికి గాని, **graded taxation system** తేవడానికిగాని పనికిరాదు దీనివల్ల సంఘంలో వుండే నిజమైన వ్యత్యాసాలను కూడా తెల్సుకోలేము ఈ నిరుపయోగమైన బిల్లు తెచ్చుటకు పెద్ద ఆర్డినెన్సుఒకటి ప్రకటించారు దీనివల్ల ఒక్క ఉపయోగంమాత్రం జరిగింది "ఏదో భూసంస్కరణలు తెచ్చి మా నెత్తిమీద పెట్టబోతున్నారు" అనే భావంతో యీ బాధలనుంచి తప్పించుకోడానికి కొన్ని కుటుంబాలు ఎన్నాళ్లనుంచో తమకొడుకులకు, కూతుళ్ళకు భూములు వ్రాయకుండా ఏడిపించేవారు, ఈ చట్టంవస్తుంది, ఇంకెవరో భూమిపట్టుకుపోతారనే భయంతో, కొడుకులకూ, కూతుళ్ళకూ వ్రాసి కలహాలు తీర్చుకున్నారు ఈ విషయాన్ని బాపినీడుగారు స్వయముగా చెప్పారు చాలా సంతోషం వారు స్వానుభవముతో చెప్పారేమో అనుకుంటాను ఈ ఒక్క ఉపయోగము జరిగింది. చాలా సంతోషం ఇంకొకటికూడ ఉన్నది ఎంతమందికి వ్రాసినా భూమియింకా మిగిలిపోతే అది ఏదోరకంగా అమ్ముకోడానికి చూస్తున్నారు. అందువల్ల తక్కువ ధరలకు అమ్ముతున్నారు. అదికూడ ఒక ఉపయోగమే. కాని భూసంస్కరణల విషయమై ఇందులోనుంచి కొంత భూమి పేదప్రజలకు వస్తుందా అంటే యీ చట్టంవల్ల రావడంలేదు. ఈ లెక్కలవల్ల అటువంటిచట్టం తేవడానికి ఉపయోగపడుతుందని అనుకోవడంలేదు

శ్రీ కె. వెంకటరావు : అధ్యక్షా, ఈ చట్టంవల్ల పేదవారికి ఉపకారం చేసే ఉద్దేశం లేదని బహిర్గతంగా తెలుస్తోంది. ఇవి అంకెలు, ఎవరి కుపయోగిస్తాయి ? పేదలకూ ఉపయోగించవు, భాగ్యవంతులకూ ఉపయోగించవు ఈ చట్టంవచ్చినతర్వాత, ముందు రాబోయేచట్టం ఉపయోగిస్తుంది ఉపయోగిస్తుందా, లేదా, దానికియిది సహకారి అవుతుందా, లేదా అనే విషయంలో అవుతుందని

కొందరంటున్నారు. కాదని కొందరంటున్నారు నేను అమెరికాద్వారా వెళ్ళదలచుకోలేదు, రష్యాద్వారా వెళ్ళదలచుకోలేదు ఈ దేశంలో పుట్టినాను యీ దేశంలోనే బ్రతికిచస్తానని నే నిదివరకే తమకు మనవిచేశాను అందుచేత సుందరయ్యగారు. యింకా దీనిని విమర్శించేవా రెవ్వరూకూడ అమెరికానుగాని, రష్యానుగాని, జ్ఞాపకం పెట్టుకోనక్కరలేదు. ఈ దేశంలో ఉన్నంతకాలం యీ దేశస్థులమే అనే ఉద్దేశంతో కార్యక్రమం చేసుకోవడం ముఖ్యమైనవిషయం ఈ బిల్లుకు సంబంధించినంతవరకూ, దీని యొక్క సహాయంవలన చేయబోయే భూ సంస్కరణలు నేను చెప్పిన పద్ధతులమీద, ఆదర్శపూర్వకంగా చేసే అవకాశం లభిస్తుందని, ఆ రకంగా చేయగలమనే సంపూర్ణ విశ్వాసంతో, ఇష్టముతో ప్రభుత్వంచేత యీ బిల్లు ప్రవేశ పెట్టబడినది ఆ ఆశయాలను నెరవేరుస్తామనే ధైర్యముతో మీరందరూ యీ బిల్లును ఆమోదించాలని కోరుతున్నాను

*Mr Speaker* The question is

"That the Andhra Pradesh Agricultural Holdings (Census( 1957 be passed into law"

The motion was adopted.

## THE MADRAS TENANTS & RYOTS PROTECTION (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

*Sri K Venkata Rao* Sir, I beg leave to introduce the Madras Tenants and Ryots Protection, (Andhra Pradesh Amendment) Bill, 1957, and move that Bill be taken into consideration at once

*Mr. Speaker* Motion moved

దీనికి ఇదివరకు ఏమీ amendments రాలేదు, కాని నిన్ననే యల్లమందా రెడ్డిగారు clause 2 కు ఒక సవరణ యిచ్చారు. నేనుదానిని allow చేస్తున్నాను.

శ్రీ కె. వెంకటరావు. ఇదివరకు మనం ఎస్టేటులను తీసికొనేకాలంలో tenants ను ఎవరూ distrub చేయకూడదని protection యిచ్చాము. ఇప్పటికీ కొన్ని ఎస్టేటులను తీసుకోలేదు. ఎన్ని ఎస్టేటులను తీసుకోలేదో యిందాక ప్రశ్నోత్తరాల సమయంలో మనవిచేశాను. ఆ నంబరులను తీసుకునేందుకు protection యింకా కొన్నాళ్ళు వుంటేగాని నడవదనే భయంతో యిది తీసుకురావలసివచ్చింది. ఇప్పుడు నేను చెప్పిన ఎస్టేటులను ప్రభుత్వం కైవశం చేసికొని

చట్టప్రకారం అమలులోనికి తీసుకువచ్చేందుకు 2 సంవత్సరాల కాలం పడుతుంది అనుకొని, ఇప్పటికి 2 సంవత్సరాల 4 మాసాలు వుంచినప్పటికీకూడా అక్టోబరు 1959 సం॥ దాకా దరిదాపు 3 ఏండ్లు ఉన్నది ఈ రెండు ఏండ్ల పైచిల్లరకాలంకూడా వ్యవధి యిప్పించవలసినదని కోరుతున్నాను. నేను యిదివరకు ఒక ప్రశ్నకు సమాధానంగా Estates లో 17 వేల ఎకరాలలో 240 ఎకరాలకు survey settlement జరిగిందనిచెప్పాను ఈ fasli లో సుమారు 4,500 చదరపు మైళ్ళ విస్తీర్ణం ప్రారంభం అయి 1960 నాటికి అంతా పూర్తి అయిపోవాలనే కోరిక ఉన్నది అందువల్ల ఈ Tenants Protection Act కు 7th October, 1959 దాకా గడువు యిప్పించవలసినదని, దీనిని సమర్థించవలెనని కోరుతున్నాను మిత్రులు యల్లమందారెడ్డిగారు ఇదంతా మళ్ళీ ఇంకొక తారీఖువరకూ నెట్టి మళ్ళీ చేయడం ఎందుకూ ? అంటున్నారు భావం విషయంలో నాకేమీ అభ్యంతరం లేదు కాని ఒక definiteness అనేది ఈ బిల్లులో లేకపోయినట్లయితే విమర్శలకు పాత్రుల మౌతామేమో అందుచేత ఇంకా అనుమానం ఉన్నట్లయితే ప్రస్తుతం ఉన్న 7th October, 1959 కి బదులుగా 7th October 1960 అని పెట్టవచ్చు అప్పటికిమాత్రం ఇవేమీ ఉండవని ధైర్యంగా చెప్పవచ్చు ఎందుకంటే settlement programme అప్పటికి complete అయిపోతుంది. అంత కొంప మునిగిపోతే అపుడే చూచుకొందాం అందుచేత 1960 అనే దానికి అంగీకరించడానికి నాకేమీ అభ్యంతరంలేదు దానికి వారుకూడా అంగీకరించి ఈ బిల్లును ఏకగ్రీవంగా pass చేయాలని కోరుతున్నాను

శ్రీ జి. యలమందారెడ్డి అధ్యక్షా ! ఈ సవరణను గురించి చెప్పే ముందుగా ఒకటి రెండు విషయాలను ఈ సందర్భంలో తమకు మనవి చేయాలని అనుకొంటున్నాను. ఈ amending bill అందరు, support చేయవలసినదే మంత్రిగారు ఈ దినం సమాధానం చెప్తూ సుమారు 1597 sub-divided estates ఉన్నాయని ఇంకా 7 ఈనాంలు, 16 tenure estates ఉన్నాయని చెప్పారు. ఈ ఎస్టేట్స్‌కు సంబంధించిన గ్రామాలు మొత్తం 1,597: అది పెద్ద సంఖ్య అని వేరే చెప్పవలసిన అవసరంలేదు ఇదివరలో Zamindari Abolition Act ప్రకారం కొన్ని communal lands ను తీసుకొనడం జరగలేదు అటువంటి estates లోనే బినామీ పట్టా లివ్వడం, ఎంతకాలంనుంచో సాగుచేసుకుంటూ ఆ భూములపై హక్కు ఉన్నటువంటి రైతులకు పట్టా లివ్వడం జరిగేది. జమీందారులవద్ద రికార్డులుకూడా ఉండవు అందుచేత ఈ రైతులనుభవించే

భూములను కూడా eliminate చేయడానికి అవకాశాలు ఉన్నాయన్న సంగతి మంత్రిగారికి కూడా తెలుసు ఈ దినము ప్రశ్నోత్తరాల సమయములో శ్రీ గున్నయ్యగారు ఇదివరకునుంచీ సాగు చేసుకుంటున్నటువంటి రైతులను కూడా తొలగించడానికి కొన్ని ప్రయత్నాలు జరుగుతున్నాయని నివేదించినారు ఇలాంటివి జరుగకుండా చేయడానికి బిల్లు తీసుకురాబోతున్నా మని ఆ సందర్భములో చెప్పారు. అందువల్ల ఈ బిల్లును తీసుకొని రావడంతోనే సంతృప్తి చెందకుండా, ఇది సక్రమంగా అమలు జరగడానికి తగిన చర్యలు తీసుకోవాలని నేను మనవిచేస్తున్నాను ఇలాంటి estates లో ఉన్నటువంటి భూస్వాములు తమక్రిందఉన్న కౌలుదారులను తొలగించకుండా ఉండేటటువంటి రక్షణ కల్పించాలి, అసలు ఇలాంటి estates లో రైతులను భూములనుంచి evict చేయకుండా వారికి రక్షణ కల్పించాలి అనేవి రెండు విషయాలున్నాయి ఇదివరకు కౌలుదారుల రక్షణచట్టం అమలులోకి వచ్చినపుడు అనేకమంది కౌలుదారులు భూములనుంచి తొలగించి వేయబడిన సందర్భాలున్నాయి కౌలుదారులు అనేక petitions పంపుకోవడం, చిన్నచిన్న technical points ఆధారంగా చేసుకొని వాటిని కొట్టివేయడం ఆ petitions పెట్టుకొన్నవారిని సంపూర్ణంగా భూమినుంచి తొలగించివేయడం వంటి దారుణమైన సందర్భాలున్నాయి ఇవన్నీ నాకు అనుభవమున్నవే ఆ భూములకు సంబంధించిన సక్రమమైనటువంటి records కాని survey settlements కాని, ఉండకపోవడంవల్ల ఆ ప్రాంతాలలో జమీందారుల వలుకుబడి జాస్తీగా ఉండడవల్ల ఈ విధమైన దారుణాలు జరుగుతున్నాయి. అందువల్ల ఈ చట్టాన్ని కేవలం నామ మాత్రం చేయడమే కాకుండా, etates లో ఉన్నటువంటి కౌలుదారులకు, రైతాంగానికి సక్రమంగా రక్షణ కలిగేటట్లుగా, వాళ్ళు evict చేయబడకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద పూర్తిగా ఉన్నదని మనవిచేస్తున్నాను, ఈ 'not taken over estates' లో వున్నటువంటి కౌలుదారులకు రైతులకు ఇంకా ఇతర విధములైన ఇబ్బందులున్నాయి వాటిని మంత్రిగారు గమనించాలని తమద్వారా మనవి చేస్తున్నాను. Rent Reduction Act ప్రకారం 'not taken over estates' లో శిస్తులు వసూలుచేసి జమీందారులకు, ఎస్టేటుదారులకు వారి వాటా ఇచ్చే బాధ్యత మన ప్రభుత్వంమీద ఉన్నది కాని, అచటనున్న చిన్న చిన్న చెరువులకు మరమ్మతులు సరిగా లేక కౌలుదారులకు రైతులకు పంటలు పోయినట్లయితే వారికివ్వవలసిన remissions యివ్వటానికి కాని, అప్పులు యివ్వటానికి కాని, చెరువుల మరమ్మతు చేయటానికి కాని మన ప్రభుత్వానికి ఏమీ హక్కు లేదని నేను మనవి చేస్తున్నాను. అందువల్ల అచటఉన్న సాధారణ

రైతాంగానికి, కౌలుదారులకు ఏ విధమైనటువంటి సహాయం, రక్షణలు లేకుండా పోతున్నాయని మనవి చేయుచున్నాను ఈలాంటి విషయాలలో నాకు చాలా అనుభవం ఉన్నది ఈ సందర్భంలో ఒక ఉదాహరణను చెబుతున్నాను ఒక estate గ్రామంలోని చెరువుకట్ట సుమారు 7, 8 సంవత్సరాల క్రితం తెగి పోయింది దానిని యింతవరకు మరమ్మతు చేయలేదు ఈ విషయాన్ని నేను కలెక్టరుగారి దృష్టికి తీసుకువెళ్ళినపుడు ఆయన ప్రభుత్వం ఆ estate ను తీసుకొనలేదు కాబట్టి చట్టంప్రకారం ఆ చెరువును మరమ్మతు చేయడానికి నాకేమీ అవకాశం లేద"ని చెప్పారు కాని ప్రభుత్వంమాత్రం రైతులవద్దనుంచి శిస్తులు వసూలుచేసి ఎస్టేటుదారులకు యిస్తుంది ఈ anomolies ఉన్నంత కాలం అచటి రైతాంగానికి ఏ విధమైనటువంటి సౌకర్యాలు ఉండవు ఈ విషయాలు High Court లో pending గా ఉన్నాయని మంత్రిగారు మొన్న సెలవిచ్చారు హైకోర్టువారు వాటిని ఎపుడు dispose చేస్తారు, అనేవిషయం మన ఆధీనంలో లేదు. చాలారోజులు పట్టవచ్చు ఈ విధంగా చాలారోజులు జరిగేలోపలనే అచటి రైతాంగానికి కావలసిన సౌకర్యములను, అవకాశాలను, statutory గా కాకపోయినా, conventionl గా నైనా, కలుగచేయడానికి ప్రభుత్వం తప్పకుండా ఆలోచించాలని కోరుతున్నాను ఈ చట్టాన్ని సక్రమంగా అమలు జరుపుతూ, estates లో ఎవరూకూడా వారు అనుభవిస్తున్న హక్కులనుంచి తొలగించబడకుండా చేయడం ప్రభుత్వబాధ్యత, ఈ 'not taken over estates'లో remission మొదలైనటువంటి విషయాల్లో ఇతర రైతాంగానికి ఉన్నటువంటి సౌకర్యములు కలుగచేయవలసిన బాధ్యతకూడా ప్రభుత్వవిధి ఈ చట్టాన్ని తొందరగా అమలు జరపడమనేది వారి మూడవబాధ్యత. ఈ మూడుబాధ్యతలు ప్రభుత్వంపైన ఉన్నాయని నేను మనవిచేస్తున్నాను ఈ పనులను వెంటనే చేయడానికి ఉన్న యిబ్బందులలో ఒకటి high court వారు వాటిని dispose చేయడం. రెండవది డబ్బు విషయం, ఈ estate తీసుకున్నపుడు ఎస్టేటుదారులకు నష్టపరిహారం యివ్వవలసి ఉన్నది, కాబట్టి 8 కోట్ల రూపాయల నష్టపరిహారం చెల్లించవలసి ఉండవచ్చు.

శ్రీ కె. వెంకటరావు : 5, 6 లక్షల రూపాయల కెక్కడా నష్టం కాదలేదు.

శ్రీ జి. యలమందారెడ్డి : ఇపుడు మంత్రిగారుకూడ చెప్తున్నారు. నష్టపరిహారం యివ్వడంవల్ల కలిగేనష్టం లేదని. కాబట్టి సాధ్యమైనంత త్వరలో ఈ విషయాల నన్నిటినీ పరిష్కారం చేసినట్లయితే చాలా బాగుంటుంది. మంత్రిగారు చెప్పిన సవరణకు నా కెలాంటి ఆక్షేపణాలేదు, అందువల్ల నేను

చెప్పిన మూడు విషయాలను తప్పకుండా ప్రభుత్వంవారు అమలు చేయవలెనని తమద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను

శ్రీ కె వెంకటరావు ఈ వేళకు యల్లమందారెడ్డిగారూ, నేనూ ఒకటే భావంలో ఉన్నాము ఈ చట్టమును గట్టిగా అమలులో పెట్టాలని చెప్పారు. ఇపుడు వారుచెప్పిన శిస్తు రెమిషన్ యిచ్చే విషయంలో ఒక difficulty ఉంది ఎందుకంటే అచట interim payments ఉన్నాయి కనుక అక్కడ వసూలు అయినటువంటి డబ్బంతా తిరిగి అక్కడే remission యిచ్చేటటువంటి హక్కు Government కు లేకపోవడము అనేది ఒక విషయము ఇక రెండవ విషయము, ఆ చెరువు మరమ్మత్తు విషయంలో collector గారు ఆ విధముగా ఎలా చెప్పారో నాకు అర్థము కావడంలేదు చెరువుకట్ట కనుక తెగిపోయి నట్లయితే Zamindari Abolition Act క్రింద చెరువును మరమ్మతు చేసి అందుకు అయిన ఖర్చును వానివద్దనుండి వసూలుచేసుకొనే హక్కును ఇది వరకే శాసనం యిస్తోంది ఈ పరిస్థితులలో అచటి నీటివనరుల విషయములో ఏవిధమయిన కష్టం రాకుండా చేయడానికి వీలుంది తప్పకుండా చేయవచ్చు డబ్బు విషయంలో బాధలేదు. నష్టపరిహారంక్రింద 3 కోట్ల 50 లక్షల రూపాయలు యిచ్చినవాళ్ళం నేను చెప్పిన list ప్రకారం అయితే యింకో 10 లక్షలుకూడా యివ్వవలసిన అవసరం ఉండదు మిగిలినవి నే నెరుగున్నంతవరకు 14 ఎస్టేట్లున్నాయి చాలావరకు single village ఎస్టేట్లు 10, 15 గ్రామాలున్నటువంటి ఎస్టేట్లు లేవు కనుక ఈ విధమయినటువంటి యిబ్బంది లేదు కనుక, దీనిని వెంటనే అమలులోపెట్టి రద్దు చట్టం పూర్తిగా అమలుపరుస్తామని తమకు మనవిచేస్తూ ఈ బిల్లును accept చేయమని కోరుతున్నాను

*Mr Speaker:* The question is

"That the Madras Tenants and Ryots Protection (Andhra Pradesh Amendment) Bill, 1957, be taken into consideration at once."

The motion was adopted.

*Clause 2*

*Sri K. Venkata Rao.* I beg to move.

"In line 5 of clause 2, for the figures '1959' substitute the figures '1960'."

*Mr. Speaker* Amendment moved.

*Mr Speaker*: The question is

"That in line 5 of clause 2, for the figures '1959' substitute the figures '1960'."

The motion was adopted.

*Mr Speaker* The question is

"That Clause 2, as amended, stand part of the Bill"

The motion was adopted

Clause 2, as amended, was added to the Bill

*Clause* 3

*Mr Speaker* The question is

"That Clause 3 stand part of the Bill"

The motion was adopted

Clause 3 was added to the Bill

*Short Title and Commencement*

*Mr. Speaker*. The question is

"That the Short Title and Commencement stand part of the Bill"

The motion was adopted.

Short Title and Commencement were added to the Bill

*Preamble*

*Mr. Speaker* The question is ·

"That the Preamble stand part of the Bill."

The motion was adopted

Preamble was added to the Bill

*Sri K. Venkata Rao* · I beg to move

"That the Madras Tenants and Ryots Protection (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law."

*Mr. Speaker*. The question is.

"That the Madras Tenants and Ryots Protection (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law"

The motion was adopted.

## THE ANDHRA PRESERVATION OF PRIVATE FORESTS (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957

మిస్టర్ స్పీకర్ ఈ పూట ఇంతకన్నా పనిలేదు.

శ్రీ కె. వెంకటరావు: ఇంకొకబిల్లు ఉన్నది.

మిస్టర్ స్పీకర్: అది ఎజెండాలో లేదు.

శ్రీ. కె. వెంకటరావు మూడవ బిల్లును యీనాడు చర్చించుకుందామని మొదటనుంచీ అనుకున్నాము

మిస్టర్ స్పీకర్ ఎజండాలో వేయలేదు

శ్రీ కె వెంకటరావు యిది చిన్నబిల్లు దీనికి సవరణలు లేవు కొద్ది సేపటిలో దీనిపై చర్చ ముగించవచ్చు

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఆఫీసులో పొరపాటున ఒకవేళ యీ బిల్లును అజెండాలో చేర్చకపోయి ఉండవచ్చును. యీ బిల్లును ఇక్కడ అపోజ్ చేసేవారు ఎవరూలేరు కనుక అవసరమైతే యీ బిల్లును వెంటనే చర్చించుటకు అనుమతించవలసినదని కోరుతున్నాను. దీనిని బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీలో అంగీకరించాము కనుక యీ బిల్లును ఇపుడే పాస్ చేద్దాము

మిస్టర్ స్పీకర్ అయితే, నాకు అభ్యంతరములేదు

*Sri K Venkata Rao* · I beg to move

"That the Andhra Preservation of Private Forests (Andhra Pradesh Amendment) Bill, 1957, be taken into consideration "

*Mr Speaker* Motion moved

శ్రీ కె. వెంకటరావు ఇది కూడా పీరియడు యొక్క ఎక్స్టెన్షన్‌కు సంబంధించినదే ఇక్కడ కూడా 2nd day of December 1960 అంటే సరిపో తుంది ఆ రకంగా బిల్లును ప్రతిపాదిస్తున్నాను.

*Mr Speaker* The question is

"That the Andhra Preservation of Private Forests (Andhra Pradesh Amendment) Bill, 1957, be taken into consideration."

The motion was adopted.

*Clause* 2

*Sri K. Venkata Rao*. I beg to move.

"In lines 6 and 7, for the words, figures and letters 'up to and inclusive of the 2nd day of December 1959', the words, figures and letters 'upto and inclusive of the 2nd day of December 1960' shall be substituted."

*Mr. Speaker*: Amendment moved

(Pause)

శ్రీ జి. ఎలమందారెడ్డి: ఎన్ని పారెస్ట్సు ఉన్నవో మంత్రిగారు తెలిపితే బాగుంటుంది.

శ్రీ కె. వెంకటరావు: ఆ ఇన్‌ఫర్మేషన్ ఇపుడు సిద్ధముగాలేదు. సర్వే, సెటిల్‌మెంట్లు జరగనిదే సరైన ఇన్‌ఫర్మేషన్ ఇవ్వలేము. కొన్ని ఫారెస్టుల విషయంలో కన్‌సెషన్ కావాలని ఎల్లమందారెడ్డిగారు అడిగారు. నేను ఇవ్వడానికి అంగీకరించాను. కంచెలు తీసివేసి ఫారెస్టులో కలపడం కంప్లీట్ అయ్యేదాకా ఉపయోగించుకోవాలని యిందాక చెప్పాను. అందువల్ల ఈ సవరణ అంగీకరించవలెనని కోరుతున్నాను.

శ్రీ జి. ఎలమందారెడ్డి: ఈ బిల్లు మంచిదే. ఐతే మా అనుభవమును గురించి మంత్రిగారికి చెప్పదలచుకున్నాను. వెంకటగిరి ఎస్టేటులో కొన్ని ఫారెస్టులుఉన్నాయి. వాటిలో చిన్న మొక్కకూడా లేకుండా మొత్తము అంతా కొట్టించి లారీలకు ఎత్తించడం జరుగుతున్నది. ఆ ఫారెస్టుయొక్క స్వరూపము మార్చివేయడం జరుగుతున్నది. చట్టము ప్రకారము ఆ అడవులు ప్రభుత్వానివే. హైకోర్టులో రిట్లు ఉన్నందువల్ల గాని లేక ఇతర కారణాలవల్ల కాని యీ భూములు జమీందారుల చేతులలో ఉండడమువల్ల యీ చట్టం అమలు జరగడం లేదు. ఇది తప్పనిసరిగా అమలు జరిగేటట్లు చూడవలసియున్నది.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం): యీ బిల్లు అమలు జరగడంలేదని మనకందరకు తెలుసు. క్రిష్ణాజిల్లాలో నాకున్న అనుభవమును పురస్కరించుకొని అక్కడ జరుగుతున్న అక్రమాలను గురించి తెలియజేస్తాను. 200 ఎకరములకుపైగా ఉన్న అడవులు యీ చట్టం క్రిందకు రావలసియున్నది. అనేక వందల ఎకరాల అడవులు ఉన్నప్పటికి వాటిని కొట్టివేసి లేదా బొగ్గుక్రింద మార్చి ఎగుమతి చేయడం జరుగుతున్నది. ఆ భూములను మామిడి తోటల క్రిందకు ఇతర విధములయిన భూములగానూ మార్చడం జరుగుతున్నది. ఇది ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చినా అత్యం లేకుండా ఉన్నది. యీ మధ్యన మేమీ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చినప్పుడు ఒక ఫారెస్టును స్వాధీనము చేసుకున్నారు. కాని ఇంకా చాలా అడవులున్నాయి. ఒకనాడు 100 ఎకరముల విస్తీర్ణమున్న అడవులు యీనాడు 25, 50 ఎకరముల

విస్తీర్ణములోకి దిగిపోతున్నాయి ఒకవైపున ఫారెస్ట్సు అభివృద్ధి చెందాలని చెపుతున్నప్పటికీ యీ చట్టం సరిగా అమలు జరగడం లేదు అడవులను కొట్టి వేస్తున్నారు బొగ్గు క్రిందకూడా మార్చివేసి అమ్ముకుంటున్నారు, అటువంటి వాటికి రక్షణ కలుగచేయాలని మనవి చేస్తున్నాను అడవుల స్వరూపము మారకుండా చూడాలని కోరుతున్నాను

శ్రీ కె వెంకటరావు విశ్వేశ్వరరావుగారు, ఎల్లమందారెడ్డిగారూ యీ చట్టం అమలు జరగడంలేదని చెప్పారు వారుకూడా సహాయపడితే తప్పకుండా దీనిని అమలు చేయడానికి ప్రయత్నం చేస్తాము "మనిషిని చంపడం ఎంత పాపమో, చెట్టును చంపడం కూడా అంతే పాపము" అనేటటువంటి సిద్ధాంతంతో మనం యీ అడవులను రక్షించడానికి ప్రయత్నం చేద్దాము

*Mr Speaker* The question is

"In lines 6 and 7, for the words, figures and letters 'up to and inclusive of the 2nd day of December 1959', the words, figures and letters 'up to and inclusive of the 2nd day of December 1960', shall be substituted "

The motion was adopted

*Mr Speaker* The question is

"That Clause 2, as amended, stand part of the Bill "

The motion was adopted

Clause 2, as amended, was added to the Bill.

*Clause* 3.

*Mr Speaker* The question is

"That Clause 3 stand part of the Bill "

The motion was adopted

Clause 3 was added to the Bill

*Short Title*

*Mr. Speaker* : The question is

"That the Short Title stand part of the Bill "

The motion was adopted.

The Short Title was added to the Bill

*Preamble*

*Mr Speaker* The question is

"That the Preamble stand part of the Bill"

The motion was adopted

The Preamble was added to the Bill

*Sri K Venkata Rao* I beg to move

"That the Andhra Preservation of Private Forests (Andhra Pradesh Amendment) Bill, 1957, be passed into law"

*Mr. Speaker* · The question is

"That the Andhra Preservation of Private Forests (Andhra Pradesh Amendment) Bill, 1957 be passed into law"

The motion was adopted.

*Mr. Speaker* We shall now adjourn till 8-30 a m tomorrow, the 14th November 1957

*The House then adjourned till Half Past Eight of the Clock on Thursday, the 14th November, 1957*